# BILHANA

WITH

TELUGU MEANINGS.





V. RAMASWAMY SASTRULU & SONS,
*292, Esplanade,*
MADRAS.
1925.

# బిల్హణచరిత్రము

ఆంధ్రటీకాతాత్పర్యసహితము.





చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే

ప్రకటితము.

1925.

## శ్రీ ర స్తు.

# బి ల్హ ణ చ రి త్ర ము.

అలం కమలజన్మనా కమలలోచనే నా ప్యలం
మనోభవవిరోధినా విషమలోచనే నా ప్యలమ్,
ప్రతిక్షణవిజృమ్భణా దుభయబాహుకూలఙ్కష
స్తనత్రుటితకఞ్చుకం నమత యౌవనం యోషితామ్. 1

టీ. కమలజన్మనా = (కమలమందుఁ బుట్టిన) బ్రహ్మ దేవునితో, అలం = అక్కఱలేదు. కమలలోచనేనాపి = పద్మములవంటి కన్నులుగల వాఁడైన విష్ణువుతోను, అలం, మనోభవవిరోధినా = మన్మథునికి శత్రువైన, విషమలోచనేనాపి=శివునితోను, అలం, ప్రతిక్షణ విజృంభణాత్ = క్షణము నకు క్షణమునకు నిక్కుటవలన, ఉభయబాహుకూలంకష స్తనత్రుటితకంచుకం-ఉభయ బాహుకూలంకష = రెండు చంకలను ఒరయుచున్న (అంత గాబలిసిన), స్తన=చన్నులచేత, త్రుటిత=పిగిలిన, కంచుకం=రవికెగలదైన, యోషితాం = స్త్రీలయొక్క, యౌవనం = యౌవనమునుగూర్చి, నమత= నమస్కరింపుఁడు.

తా. బ్రహ్మదేవుఁడు కమలమందుఁ బుట్టినవాఁడైనను అనఁగాఅయోనిసంభూతుఁడై పవిత్ర జన్మగలవాఁడైనను విష్ణువు పద్మమువంటి కన్నులు గలవాఁడై మిక్కిలి చక్కనివాఁడైనను శివుఁడు కామునికి శత్రువై జితేంద్రియుఁడైనను ఈమువ్వురిదేవతలయోగ్యతలును కామాసక్తు లయినవారికి నుపయోగించునవికావు గాన వారి సేవింపఁబనిలేదు. నిమిషనిమిషంబునకును నుబుకుచుండెడి చనుగుబ్బలుగలిగి ప్రత్యక్షముగా నుపయోగించుస్త్రీలయౌవన

నమే సేవనీయమైయున్నది యనితాత్పర్యము. మఱియొకవిధముగాఁ దాత్ప ర్యార్థము:-లోకమునందు సర్వమతములవారును ఇష్టదేవతోపాసనయే సకల పురుషార్థసాధకమని చెప్పుచుండఁగా ఇక్కడ తద్విరుద్ధముగా చెప్పుట విపరీతలక్షణచేత కాముకు లైనవారు "కామాంధాః కిన్న కుర్వంతి" అను నట్లు తామెంత చదువుకొన్న వారైనను బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో నెవ్వరి నైనను ఆరాధించి తత్ప్రసాదలబ్ధము లయి ధర్మ్యములైన కామసుఖములను దివ్యసుఖములను బొందవచ్చునను వివేకమునువదలి ఇహపరములకు బాధకము లయిన యధర్మ కామములయం దాసక్తులగుచున్నారు అని వ్యంగ్యము. దీని చేత బిల్హణుఁడు విద్వాంసుఁ డైనను కామపరవశుఁ డై అధర్మముగ శిష్యు రాలిని గూడినాఁ డని కావ్యార్థము సూచింపఁబడినది. పైగ్రంథమంతయు నీయర్థ వివరణమే యని యెఱుంగనలయును.

పృథ్వీమణ్డలనాభిభూత మమరాణా ముత్తరే ణాలయం
ప్రాయఃకోవిదసాధురాజిమహితే పఞ్చాలదేశేఽభవత్,
లక్ష్మీమన్దిరనామకం పురవరం నానాసుఖైకాస్పదం
తత్రాఽఽసీ న్మదనాభిరామనృపతి ర్భూపాలచూడామణిః. 2

టీ. పృథ్వీమండలనాభిభూతం = భూమండలమునకు బొడ్డుగా నుండునట్టి (అనఁగా భూమధ్యమునం దున్నట్టి), అమరాణాం=దేవతలయొక్క, ఆలయం=నివాసమునకు (మేరుపర్వతమునకు) ఉత్తరేణ=ఉత్తరపుతట్టు, ప్రాయః=తఱుచుగా, కోవిదసాధురాజి మహితే =విద్వాంసులైన సజ్జనుల సమూహముచేత పూజింపఁ బడుచున్న, పఞ్చాలదేశే = "పంచాల" మను దేశమునందు, నానాసుఖైకాస్పదం = పలువిధములైన సుఖములకు ముఖ్య స్థానమై,లక్ష్మీ మందిర నామకం = లక్ష్మిమందిర మనే పేరుగల, పురవరం= శ్రేష్ఠమైన పట్టణము, అభవత్ = ఉండెను.తత్ర=ఆపురమునందు, భూపాల చూడామణిః = రాజులకు తలమానికమైన (రాజులలో శ్రేష్ఠుఁడగు), మద నాభిరామనృపతిః = మదనాభిరాముఁడ నురాజు, ఆసీత్ =ఉండెను.

తా. భూమధ్యమునందు మేరుపర్వతము గలదు; దానికి నుత్తర పార్శ్వమున పాంచాలదేశమున్నది; ఆదేశమున లక్ష్మీమందిరమను పట్టణ ముండెను. అందు మదనాభిరాముఁ డను రాజుగలఁ డనియర్థము. భూమధ్యమైన మేరువుగాని తదుత్తరభూములుగాని మనుజులకు గమ్యములుగావని పురాణములు ఘోషించుచుండఁగా నివ్విధముగా నిట్లు చెప్పుట వర్ణింపఁబోవుశృంగారరసమున కనురూపమగు దేశవైలక్షణ్యప్రతీత్యర్థమే కల్పితమని తోచుచున్నది. ఈవిధమునసే కథయంతయు కల్పితముగా నుండవచ్చునని తోచుచున్నది.) అట్లుగాక పృథ్వీమండల మనఁగా భరతఖండభూమిమాత్రమె గ్రహించుట వాడుకకలదు. అప్పుడు అమరాలయ మనునది యేదో యొక పర్వతవిశేష మని చెప్పిన పాంచాలదేశ మనునది సంగతమగును.

మన్దారమాలా తస్యాఽసీ న్మహిషీ సుగుణాఽతయోః,
యామినీపూర్ణతిలకా తనయా వినయాన్వితా. 3

టీ. తస్య=అతనికి, మందారమాలా="మందారమాల" యను పేరుగల, సుగుణా=మంచిగుణములు గలదైన, మహిషీ=పట్టపుదేవి, ఆసీత్=ఉండెను. తయోః=వారిద్దరికిని, యామినీపూర్ణతిలకా="యామినీ పూర్ణతిలక" యనుపేరుగల, వినయాన్వితా=వినయముతోఁ గూడుకొనిన, తనయా=కూఁతురు, ఆసీత్.

తా. ఆరాజునకు మందారమాల యనుపేరుగల సద్గుణవతియగు భార్యగలదు. ఆదంపతులకు యామినీపూర్ణతిలక యనువినయముగల కూఁతురుండెను. (రాజు మదనాభిరాముఁడని చెప్పుటచేత శృంగారరసాభిజ్ఞుఁ డనియు అతనిదేవి మందారమాల యనుటచే నతని కనురూపముగ నుపభోగార్హయై యుండె ననియు వీరు శృంగారరసకోవిదులు గావున తమపుత్రిక సౌందర్యాదులఁ జూచి యామినీపూర్ణతిలక యని పేరిడి రనియుఁ దెలియ నగును.

ఆసీత్ సా నవయౌవనా మధురవాక్సౌభాగ్యభాగ్యోదయా
కర్ణాన్తాయతలోచనాఽతిచతురా ప్రాగల్భ్యగర్వాన్వితా,
రమ్యా బాలమరాళమన్థరగతి ర్మత్తేభకుమ్భస్తనీ
బిమ్బోష్ఠీ పరిపూర్ణచన్ద్రవదనా భృఙ్గాళినీలాలకా. 4

టీ. సా=ఆయామినీపూర్ణతిలక, నవయౌవనా=క్రొత్త యౌవనము గలదై, (అనగా స్త్రీలయౌవనము పండ్రెండవసంవత్సరము మొదలు ఏఁబదియైదు సంవత్సరములు దనుకఁ గలదని చెప్పి దాని నాలుగువిధములుగా విభాగించి వాని లక్షణములను సవిస్తరముగ నిరూపించి అందు ప్రథమ ద్వితీయ యౌవనములే నాటకాద్యుత్తమ కావ్యములందు వర్ణనీయము లనియు తృతీయ చతుర్థ యౌవనములు ప్రహసనాది నీచపాత్రోచిత సందర్భములకుఁ దగినవనియు నాలంకారికులు విధించియున్నారు గావున నిక్కడ శృంగార రసపరిపోషార్థము ప్రథమయౌవనమే చెప్పఁబడినది. ప్రథమ యౌవనము పండ్రెండవసంవత్సరము మొదలు పదునాఱవ సంవత్సరమువఱకు అని తెలియవలెను). మధురవాక్ = (చిలుకలు కోయిలలు మొదలగువాని పలుకులవలె) తీయని (వినసొంపైన) పలుకులు గలదియు, సౌభాగ్య భాగ్యోదయా - సౌభాగ్య = శుభలక్షణములయొక్క, భాగ్య = సంపదయొక్క, ఉదయా=ఆవిర్భావముగలది, (అనఁగా నామెకు శుభగుణములే కలుగు చుండు ననియర్థము).ఆమెకు వయస్సునకుఁ దగినట్టు సకలవిధములైన కామంబు లనుభవించుటను సూచించునట్టి సౌందర్య లావణ్య రసికత్వాదు లుదయించు చుండునని భావము. కర్ణాంతాయతలోచనా=చెవుల తుదలమట్టుకు నిడుదలైన తామర రేకులవంటి) కన్నులు గలదియు, అతిచతురా=మిక్కిలి నేర్పరియైనదియు, ప్రాగల్భ గర్వాన్వితా=దిట్టరితనము చేతనైన గర్వముతోఁ గూడినదియు, (అనఁగా తాను సంగీత సాహిత్యములయందలి రహస్యార్థములను సహృదయుల కుల్లాసము గలుగునట్లు నిపుణతరముగ ప్రతిపాదించుటలో కొంచమైనను జంకులేనిదై యీవిషయమున నాతోసమానులు లేరనే యభిమానము మెండుగాఁ గలదనియర్థము) రమ్యా=రమణీయ మైనదియు, (అనఁ

గా నామెను జూచువారికి చంద్రమండలమును శారదాంబుజమును జూచు నట్లు నవనవోల్లసితమైన యానందము గలుగు చుండుగాన నుపభోగార్హ యనియర్థము). బాలమరాళ మంథరగతిః=కొదమయంచల నడకవంటి నడక గలది. (అనఁగా ఈషన్మందముగను సవిలాసముగను స్వభావముచేతనే నడ చును. "వ్రజతి మృదు సలీలం రాజహంసీవతన్వీ" అని యున్నది. గనుక నీ కన్యక సర్వోత్తమమైన పద్మినీజాతి యనిభావము.) మత్తేభ కుంభ స్తనీ=మ దించిన యేనుఁగు కుంభస్థలములవంటి కుచములు గలది, (ప్రథమయౌవనమం దుఁ గుచము లున్మీలితములై మొగ్గలవలె నుండినను ఇక్కడ నిట్లు చెప్పుట వానిసౌష్ఠవముచేత నట్లు స్ఫురించుచున్నవని భావము.) బింబోష్ఠీ=(ఆరుణ్యా స్నిగ్ధత్వమృదుత్వములచేత) దొండపండునుబోలిన మోవిగలదియు, పరిపూర్ణ చంద్రవదనా = నిండుచందురునివంటి మోముగలదియు, (ఆమె మోమును జూచిన పూర్ణచంద్రునిఁజూచిన ట్లాహ్లాదము గలుగునని యర్థము.) భృంగాళి నీలాలకా=తుమ్మెదలబారువలె నల్లనైన కురులుగలదియు. ఆసీత్ =ఆయెను.

తా. ఆ యామినీపూర్ణతిలక యౌవనారంభవయస్సు గలదై యున్న ప్పుడు శైశవమునందు పలికెడు అవ్యక్తమధురములైన పలుకులకన్న వ్యక్త మాధుర్యముగల పలుకులు మిక్కిలిశ్లాఘ్యములైయుండెను. శైశవమునందలి బాల్యచపలత్వముకన్న శుభలక్షణములు క్రొత్తక్రొత్తగ నుదయించుచుం డెను. చిన్నతనమునందలి విస్మిత వీక్షణములకన్న బెళుకుఁజూపులచేత కన్నులు మరింతనిడుపారిన టుండెను. పసితనంబునందలి మౌగ్ధ్యమును వద లి ధీరురాలై యుండెను. చిన్నతనమునందలి లాలనీయత్వమునకన్న నిప్పుడు రమించుట కర్హురాలై చెలువొందుచుండెను. బాల్యమునందలి యనవస్థితగమ నమునకన్న సలీలమైన గమన మతిసుందరముగ నున్నది. సిగ్గుగలచను మొ గ్గలఁ బయ్యెదకొంగున వారించికొనుచు లజ్జాభావంబున కొకసొంపు సంపా దించుటం జేసి బాల్యమునకన్న నత్యంతవైలక్షణ్యము గలిగియున్నది. బాల్య మునకన్న నిప్పు డధరమునం దారుణ్య మతిశయించి కడుమనోహరముగను న్నది. బాల్యమునందు మోము ముంగురులచే నాచ్ఛాదిత మగుచు తుమ్మెదలచే

సొంపుసంపాదించు నరవిందముంబోలె వెలయుచుండెను. నిప్పు డంతకన్నను గాంతియుక్తమై పూర్ణచంద్రుని బోలియున్నది. కురులు మిగుల నిగనిగలాడు చున్నవి యని భావము.

దృష్ట్వా తాం మదనాభిరామనృపతిః పుత్రీం పవిత్రస్వరాం
సంగీతామ్బునిధేః సుధాకరకలాం సాహిత్యహీనాం తదా,
కావ్యాలంకృతినాటకాదినిపుణా కార్యా మయేతి ధ్రువం
నిశ్చిత్యాఽఽశు పరం ప్రధానసచివం పప్రచ్ఛ కార్యక్రమమ్.

టీ. మదనాభిరామనృపతిః=మదనాభిరాముఁ డనునట్టి యారాజు, పవిత్రస్వరాం=స్వచ్ఛమైన కంఠస్వరముగలదియు, సంగీతాంబునిధేః=సంగీత శాస్త్ర మనే సముద్రమునకు, సుధాకరకలాం=చంద్రకళ యైనదియు, (అనఁగా పాలసముద్రములో తత్సారముగ చంద్రుఁ డుదయించినట్లు సంగీత శాస్త్రరహస్యము లన్నియు నీయామినీపూర్ణతిలకగావచ్చి యున్నవోయను నట్లున్నది యనియర్థము; సంగీతసర్వస్వము తెలిసిన దని భావము.) పుత్రీం=(తన) కొమరితను, తదా=అప్పుడు (ఆయావ నారంభమునందు), సాహిత్యహీనాం=సాహిత్యముచేత కొఱవడినదానినిగా, దృష్ట్వా=చూచి, (తక్కిన అన్నిగుణములుండుటను సాహిత్యముమాత్రము లేకుండుటను తలఁచి అని యర్థము.) మయా=నాచేత (నాకూఁతురు), కావ్యాలంకృతి నాటకాది నిపుణా=కావ్యములయందును అలంకారశాస్త్రములందును నాటకము మొదలగు నాట్యప్రబంధములయందును నేర్పుగలదిగా, కార్యా=చేయఁదగినది. (అనఁగా కావ్యములు మొదలగువానిని చక్కఁగా చదివి వానియందు మిక్కిలి తెలివిగలది యగునట్లుగా చేయవలెను) ఇతి=అని (తలఁచి), ధ్రువం=గట్టిగా, నిచ్చిత్య=నిశ్చయించి, ఆశు=(ఇట్లుతలఁచిన) వెంటనే, ప్రధానసచివం=ముఖ్యమంత్రిని, పరం = ఇఁకమీఁదచేయవలసిన, కార్యక్రమం=కార్యపద్ధతిని, పప్రచ్ఛ=అడిగెను.

తా. యామినీపూర్ణతిలక బాల్యమునందే సంగీతము నభ్యసించి దాని యందు మంచి నేర్పుగలిగి మధురమైనకంఠస్వరముగలదై యౌవనము వచ్చినప్పటికి సౌందర్య మతిశయింపఁగా సాహిత్యముతప్ప తక్కిన గుణములన్నియు సమగ్రముగ నుండుటను జూచి ఇఁక సాహిత్య మభ్యసింపఁ జేయవలయునని రాజు మంత్రితో నాలోచించెను.

యామినీపూర్ణతిలకా సంగీతనిపుణా కృతా,
సాహిత్యవిద్యా త్వభ్యస్యా యువత్యా ప్రౌఢయా తయా.

టీ. (మంత్రీ!) యామినీపూర్ణతిలకా= (మన) యామినీపూర్ణతిలక, సంగీతనిపుణా=సంగీతమునందు నేర్పుగలదిగా, కృతా=చేయఁబడినది. సాహిత్యవిద్యా తు=సాహిత్యవిద్య యన్ననో, (ఇప్పుడు) యువత్యా=యౌవనము వచ్చినదై, ప్రౌఢయా = దిట్టరిగానుండిన, తయా=ఆమెచేత, అభ్యస్యా= నేర్పఁదగినది.

తా. సంగీతవిద్య అర్థపరిజ్ఞానముతో నక్కఱలేదని గనుకను కంఠస్వరముఅప్పుడె కుదురవలె గనుకను, బాల్యమునందే సంగీతవిద్య నభ్యసింపఁ జేసితిమి. సాహిత్యము బుద్ధిబలముచే గ్రహింపఁదగినది గనుక ఇప్పు డభ్యసింపఁజేయుటకుఁ దగినసమయమని తాత్పర్యము.

ముఖ మఖిలంనయనయుగం వక్షః సర్వం పయోధరద్వన్ద్వమ్,
మధ్య మశేషం గగనం తస్యాః శిక్షావిధౌ సమర్థః కః. 7

టీ. (ఆమెకు) ముఖం=-ఖిలం=ముఖముఅంతయు, నయనయుగం= కనుదోయిగా, (అయియున్నది. అనఁగా కన్నులు గొప్పవియని యర్థము.) వక్షఃసర్వం=టొమ్ముఅంతయు, పయోధరద్వంద్వం=చనుగవ, (అయియున్నది, అనఁగా చన్నులు పెద్దవియని యర్థము.) మధ్యం - అశేషం=నడుము అంతయు, గగనం=ఆకాశము, (నడుము మిక్కిలి సన్ననిదియని యర్థము.) (ఇట్టి సౌందర్యముగలిగిన) తస్యాః = ఆమెకు, శిక్షావిధౌ=విద్య నేర్పుట యందు, కః సమర్థః=ఎవఁడు సమర్థుఁడు ?

తా. పూర్వశ్లోకమునందు మంత్రితో నాలోచించినాఁడని చెప్పఁబడెను. ఏమియాలోచించినాఁడనియిక్కడ చెప్పుచున్నాఁడు.-నాకుమారి మిగుల చక్కనిది. ఆమెకు సాహిత్యము నేర్పుటకు వచ్చినవాఁ డెంతవాఁడైనను కామమోహితుఁడై దానిచే ననర్థము సంభవించునేమో యని సందియము వొడముచున్నదని భావము. (ఈశ్లోక మిచ్చట సందర్భానుసారముగా నుండలేదు: ఏలననఁగా సాహిత్యము నేర్పవలె నను నుద్దేశముతో మంత్రిని ప్రశ్నింపఁగా మంత్రి యిక్కడ మనపట్టణములో ననేకులు విద్వాంసు లున్నారు. వారిలో నిపుణతరముగ సాహిత్యవిద్యను నేర్పువారెవ్వరో పరీక్షింప వలసిన దని చెప్పెను. ఆపైన నట్లె సాహిత్యవిద్యను బరీక్షించి బిల్హణుని గ్రహించినట్లున్నది గాని ఈమె సౌందర్యమును జూచి కామపరవశుఁడు కానివానిని పరీక్షింపవలెనని పరీక్షింపలేదు. అట్టిపరీక్షచేసి యుండి నట్లయిననే యీశ్లోకార్థము సంగత మగుచున్నది. బిల్హణుని పరిగ్రహించునపు డీయాశంకఁజేసి కపటోపాయము పన్నినారుగదా యని నట్లైన నీశ్లోక మాసందర్భములోనే యుండఁదగును )

దేవాత్ర నగరే సన్తి బహవః పణ్డితా ద్విజాః,
తానాకార్యాధునా సర్వాన్ పరీక్షా క్రియతాం పరమ్.8

టీ. మంత్రి చెప్పుచున్నాఁడు.—దేవ=రాజా! అత్ర నగరే=ఈపట్టణమందు, పండితాః=పండితులైన, ద్విజాః=బ్రాహ్మణులు, బహవః = పలువురు, సంతి=ఉన్నారు. అధునా=ఇప్పుడు, తాన్ సర్వాన్ = వారినందఱను, ఆకార్య=పిలిపించి, పరం=ప్రధానముగా, పరీక్షా=(వారిలో నెవ్వరు సాహిత్యము నిపుణముగ చెప్పఁగలవారో అట్టి) పరీక్ష, క్రియతాం=చేయఁబడవలసినది.

తా. రాజా! ఈపట్టణములో విద్వాంసు లగు వా రనేకులు బ్రాహ్మణులు గలరు గాని వారిలో నెవ్వరు సాహిత్యము బాగుగా చెప్పఁగలరో వారిని పరీక్షించుట ఆవశ్యకము.

తథైవ భూయా దితి సర్వశాస్త్ర
విశారదాం శ్చారుచరిత్రయుక్తాన్,
ఆకార్య సర్వాన్ విబుధాన్ నరేశః
పప్రచ్ఛ తాం స్తత్తదధీతవిద్యాః. 9

టీ. (ఇటు మంత్రి చెప్పఁగా,) నరేశః=రాజు, తథైవభూయాదితి=అట్లెయగుగాకయని (అనఁగా బాగుగా చెప్పఁగలవానిని బరీక్షింపవలసినదేయని), సర్వశాస్త్రవిశారదాన్=అన్నిశాస్త్రములను బాగుగ నెఱింగినవారును, చారుచరిత్రయుక్తాన్=మంచినడవడికతోఁ గూడినవారునునగు, సర్వాన్ విబుధాన్=విద్వాంసుల నందఱిని, ఆకార్య=పిలిపించి, తాన్=వారిని, తత్తదధీతవిద్యాః=వారువారు చదివినవిద్యలను, పప్రచ్ఛ=అడిగెను.

తా. ఆరాజు మంత్రి చెప్పినమాటకు సమ్మతించి ఆయూరనుండు విద్వాంసులఁబిలిపించి వారువారు చదివినవిద్య లెవ్వియెవ్వియో అడిగెను.

తర్కే వ్యాకరణే పురాణనిచయే వేదాన్తశాస్త్రేఽఖిలే
వేదే తత్పదపాఠ తత్క్రమ జటాఽఽరోహావరోహేషు చ,
కల్పే కర్మణి భవ్యబోధబహువాదప్రౌఢియోగేషు వా
నిష్ణాతా వయ మిత్యుదారమతయ స్తం ప్రోచు రుర్వీసురాః.

టీ. ఉదారమతయః=గొప్పబుద్ధిగలవారైన(అనఁగా నిపుణతరముగా నాయాశాస్త్రములందు ప్రసంగముచేయుటకు సమర్థమయిన బుద్ధిగలవారు), ఉర్వీసురాః=బ్రాహ్మణులు, తం=ఆరాజును గూర్చి, (రాజా!) వయం=మేము, తర్కే=తర్కశాస్త్రమునందు, నిష్ణాతాఇతి=నిపుణులము అని, ప్రోచుః=(కొందఱు) చెప్పిరి. వయం, వ్యాకరణే=వ్యాకరణశాస్త్రమందు, నిష్ణాతా ఇతి ప్రోచుః. వయం, పురాణనిచయే = పురాణముల మొత్తమందు, నిష్ణాతా ఇతి ప్రోచుః. వయం, అఖిలే=వేదాన్తశాస్త్రేపు సమస్తమైనవేదాన్తశాస్త్రమందు, నిష్ణాతాఇతిప్రోచుః. వయం, వేదే=వేదమందును, తత్పదపాఠ

తత్క్రమజటారోహావరోహేషుచ—తత్పదపాఠ=ఆ వేదమునకు పదమును జెప్పుటయందును, (అనఁగా వేదమునకు పదవిభాగము చెప్పునప్పుడు స్వరము వేఱువిధముగా నుండును గనుక అట్టిపదము పాఠముచెప్పుట యొక విద్యయని యర్థము.) తత్క్రమ=ఆ వేదమునకు క్రమము చెప్పుటయందును, (వెనుకపదము ముందుపదముతోను ముందుపదము వెనుకటిపదముతోను గూర్చిచెప్పుట, అదియొక బుద్ధివైశద్యకారణము.) జటా=వేదమునకు జట చెప్పుటయందును, (జటయనఁగా వేదపదములను జడయల్లినట్లుగా ముందు వెనుకపదములను మార్చిమార్చి చెప్పుట.) ఆరోహావరోహేషుచ=పదములు క్రమముగాగాని కొన్నిపదములు విడిచివిడిచిగాని పైకిపైకిగాని క్రింది క్రిందికిగాని తప్పకుండ చెప్పుటయందును, నిష్ణాతా ఇతి ప్రోచుః. వయం కల్పే=కల్పశాస్త్రములయందును, (కల్పశాస్త్రమనఁగా వేదమునందు చెప్పఁబడినకర్మలు చేయవలసిన పద్ధతిని తెల్పునట్టిశాస్త్రము.) నిష్ణాతాఇతి ప్రోచుః. వయం, కర్మణి=ఆశాస్త్రములయందు చెప్పినట్లుచేయుటయందును చేయించుటయందును, నిష్ణాతా ఇతి ప్రోచుః. వయం, భవ్యబోధ బహువాదప్రౌఢి యోగేషువా – భవ్యబోధ=మంచితెలివిగల, బహువాద=అనేకములయిన వాదములయందు, ప్రౌఢి=దిట్టతనమునందును, యోగేషు వా=యుక్తుల యందును, నిష్ణాతా ఇతి ప్రోచుః.

తా. మిక్కిలి బుద్ధిమంతు లయి పండితు లయిన ఆ బ్రాహ్మణులు రాజుతో, రాజా మేము తర్కమునందు పాండిత్యముకలవారమని కొందఱు వ్యాకరణము తెలిసినవారమని కొందఱు పురాణముల నెఱుఁగుదు మని కొందఱు వేదాంతశాస్త్రమునందు ప్రవీణులమని కొందఱు వేదము దానికి పద క్రమము జటా ఆరోహావరోహణము చెప్పుటయందు సమర్థుల మని కొందఱు కల్పశాస్త్రమందు నిష్ణాతుల మని కొందఱు శ్రౌతమునందు నిపుణుల మని కొందఱు సభలలో దిట్టతనముతో యుక్తులు చెప్పఁగల మని కొందఱు ఇట్లు వారివారి యోగ్యతలను తెలియఁజెప్పిరి.

బుధా యూయం సర్వే నను మమ సుతాం కావ్యనిపుణాం
రసాలంకారజ్ఞాం కురుత నితరాం ప్రీతమనసః,
రసజ్ఞా నైవ స్మో వయ ముత రసజ్ఞా స్తు కవయః,
కవిత్వం కిం నాస్తి? ప్రవిశతి కథం? ఛాన్దసకులే. 11

టీ. రాజు చెప్పుచున్నాఁడు.—ననుబుధాః = ఓవిద్వాంసులారా! యూయంసర్వే=మీరు అందఱు, నితరాం=మిక్కిలి, ప్రీతమనసః=సంతోషించిన మనస్సుగలవారై, మమ సుతాం=నాకుమార్తెను, కావ్యనిపుణాం=కావ్యములయందు నిపుణురాలినిగను, రసాలంకారజ్ఞాం=రసములను అలంకారములను తెలిసినదానినిగను, కురుత = చేయుఁడు. (ఇక్కడ మీరం దఱు అనుట యావచ్చినయందఱిలో నెవ్వరైనను సరేయనియర్థము.) ఇట్లు రాజుచెప్పఁగా విద్వాంసు లనుచున్నారు.—రాజా!, వయం=మేము, రసజ్ఞాః=రసమును దెలిసినవారము, నైవ=కానేకాము. ఉత=మఱియును. రసజ్ఞాః=రసమును దెలిసినవారు, కవయః=కవులు. (అనఁగారసము కవులకే దెలియును గాని మాకు దెలియదు) అని విద్వాంసులు చెప్పఁగా రాజు అడుగుచున్నాఁడు.— విద్వాంసులారా! (మీకు) కవిత్వం=కావ్యమును రచియించుసామర్థ్యము, నాస్తికిం=లేదా? అనిరాజు అడుగఁగా విద్వాంసులు చెప్పుచున్నారు.—రాజా!, ఛాందసకులే = వైదికులసమూహమందు, కథం ప్రవిశతి = (కవిత్వము) ఎట్లుప్రవేశించును ?

తా. అయ్యా మీ రందఱును నాకొమార్తెకు రసాలంకారములతో కావ్యవిద్య నుపదేశించుటకు సమర్థులా యని రా జడుగఁగా విద్వాంసులు. రాజా మేము వైదికులము మాకు రసాలంకారయుక్తమైన కావ్యము నేర్పుటకు సామర్థ్యములేదు అనివిద్వాంసు లనిరి. దానికిరాజు అయ్యామీకు కవనములేదా యని యడుగఁగా విద్వాంసులు, కవిత్వము వైదికులకు సంభవింపదు అనిరి.

నైవ వ్యాకరణజ్ఞ మేతి పితరం న భ్రాతరం తార్కికం
దూరాత్ సంకుచితైవగచ్ఛతియథాచణ్డాలతశ్ఛాన్దసాత్,
మీమాంసానిపుణం నపుంసక ఇతి జ్ఞాత్వా నిరస్యాఽదరా
త్కావ్యాలంకరణజ్ఞ మేవ కవితాకన్యా వృణీతే స్వయమ్. 12

టీ. కవితాకన్యా = కవిత్వమనియెడుకన్యక, పితరం=తండ్రియైన, వ్యాకరణజ్ఞం=వ్యాకరణశాస్త్రముమాత్రము దెలిసినవానిని, నైవైతి=పొంద నేపొందదు. (అనఁగా 'వ్యాకరణమూలత్వాత్సర్వవిద్యానాం=అన్నివిద్యలకు ను వ్యాకరణశాస్త్రము మూలము' అని చెప్పఁబడియున్నదిగనుక కవిత్వమున కును అట్లేతలంపవలెను.) భ్రాతరం=తోఁబుట్టువగు, తార్కికం=తర్కముఁ జదివినవానిని, నైవైతి. ఛాందసాత్=వైదికునినుండి, చండాలతఃయథా= చండాలునినుండివలెను, సంకుచితైవ=ముడుచుకొనినదైయే, దూరాత్=దూర మునుండి, గచ్ఛతి=పోవుచున్నది. మీమాంసానిపుణం = మీమాంసాశాస్త్ర మునందు నేర్పుగలవానిని, నపుంసక ఇతి=నపుంసకుఁడు అని, నిరస్య=వదలి వేసి, గచ్ఛతి=పోవుచున్నది. కావ్యాలంకరణజ్ఞమేవ=కావ్యసౌందర్యమును దెలిసినవానినే, ఆదరాత్=ఆదరణతో, స్వయం=తనంతట,వృణీతే=వరించు చున్నది.

తా. విద్వాంసులు మఱియు చెప్పుచున్నారు.—కవిత్వమునకు కార ణములయిన విద్యలలో వ్యాకరణము మొదటిదిగనుక వ్యాకరణముఁ జదివిన వానికి కవిత్వము కొంతమట్టుకు అబ్బును. తర్కశాస్త్రము అర్థములనిర్ణయిం చునదిగాన కవిత్వమునకు సహకారికావచ్చును. వేదము కవిత్వమున సంబం ధింపదు. మీమాంస యుపయోగింపదు. అన్నివిద్యలలోను కావ్యాలంకార జ్ఞానము కవిత్వమునకు మిక్కిలియుపయోగకారియగును. (ఇక్కడ వైదిక మీమాంసకులను అనుచితముగ దూషించియున్నది. ఇది మిక్కిలిదోషము. వైదికమీమాంసకులె విద్వాంసులందరిలోను పూజ్యులు. వేదమీమాంసా మాత్రాధ్యేతలకు కవిత్వము అంటదని చెప్పవలసియున్నను భంగ్యంతర

ముగ వచించుటయె న్యాయము.ఈదోష మలంకారశాస్త్రములయం దుదాహరించియున్నారు.కావున నీగ్రంథ మసత్కావ్యమనుటకు సందియములేదు. సాహిత్యమనఁగా సర్వవిద్యలసహితత్వమె. కావుననే, 'అతఃకవినా సర్వజ్ఞేన భవితవ్యం=కవి అన్నింటినెఱింగినవాఁడు కావలెనని చెప్పఁబడినది. అట్టివాఁడు కాఁడేని 'విద్వత్కవయః కవయః కేవలకవయస్తు కేవలంకవయః' అని పరిహాసపాత్రుఁ డగును. మఱియు భవభూతిభట్టబాణాదులు తమవేదనిష్ఠాతత్వమును తమపదవాక్య ప్రమాణజ్ఞత్వమును తాము రచియించిన ప్రబంధాదులయందు ప్రకటించుకొనియున్నారు. వేదపరంగోపాంగములు కావ్యవిద్యకనుపయుక్తములయినయెడ వారా ప్రస్తావము సేయుట వ్యర్థముకదా? ఇంకననిట్టిదోషము లుదాహరించుట గ్రంథవిస్తర మగునని యెంచి విరమించుచున్నాఁడను).

రసాలంకారనిపుణో నవ్యకావ్యవిచక్షణః,
ఛన్దోనాటకతత్త్వజ్ఞః కోవా కవి? రుదీర్యతామ్. 13

టీ. రాజు అడుగుచున్నాఁడు.—రసాలంకారనిపుణః=రసములయందును అలంకారములయందును నిపుణుఁడును, నవ్యకావ్యవిచక్షణః=క్రొత్తకావ్యములయందు మంచితెలివిగలవాఁడును (అనఁగా,క్రొత్తకావ్యములయందు భావముల నిపుణముగ బోధించు సామర్థ్యగలవాఁడును), ఛందోనాటకతత్త్వజ్ఞః=ఛందశ్శాస్త్రములయొక్కయు నాటకములయొక్కయుయాథార్థ్యమును దెలిసినవాఁడును,కవిః=కవియగువాఁడును, (అనఁగాస్వంతముగాఁగావ్యముల రచియించువాఁడును అయినవాఁడు) కోవా=ఎవఁడు? ఉదీర్యతాం= చెప్పఁబడుఁగాక.

తా. అయ్యామీలో నెవ్వఁడైనను రసాలంకారముల బాగుగ నెఱింగి బోధింపఁగలవాఁడును క్రొత్తకావ్యములకు(అనఁగాఁ దామున్న పరిశీలించినవి గాక నూతనముగఁ జూచిన కావ్యములందు భావములను నిపుణముగఁ దెల్పఁగలవాఁడును) ఛందస్సునాటకములు చక్కఁగాఁ దెలిసినవాఁడును కావ్యము రచియింపఁగలవాఁడు నగు పురుషుఁడు గలఁడా? అని యడిగెను.

బిల్హణో మల్హణ శ్చేతి ద్వా వేతౌ సరసౌ కవీ,
తయో స్తు బిల్హణో నామ కవిరాట్ కథ్యతే బుధైః. 14

టీ. బిల్హణః=బిల్హణుఁడనియు, మల్హణశ్చేతి=మల్హణుఁ డనియు, ద్వావేతౌ=వీ రిద్దఱును, సరసౌ=రసజ్ఞానముగల, కవీ=కవులు. తయోః=వారిద్దఱిలో, బిల్హణస్తు=బిల్హణుఁ డయితే, కవిరాట్=కవులలో శ్రేష్ఠుఁడుగా, బుధైః=విద్వాంసులచేత, కథ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

తా. విద్వాంసులు చెప్పుచున్నారు.—రాజా! బిల్హణుఁడు మల్హణుఁడు అని యిద్దఱు కవులు గలరు. వారు చక్కఁగా రసమును దెలిసిన వారు. ఆయిద్దఱిలోను బిల్హణుఁడు సర్వోత్తముఁడు.

వాసః శుభ్ర మృతు ర్వస న్తసమయః
పుష్పం శర న్మల్లికా
ధానుష్కః కుసుమాయుధః పరిమళః
కాస్తూరికోఽస్త్రం ధనుః,
వాణీ తర్కరసోజ్జ్వలా ప్రియతమా
శ్యామా వయో యౌవనం
మార్గః శంకర ఏవ పఞ్చమలయా
గీతిః కవి ర్బిల్హణః. 15

టీ. శుభ్రమేవ=తెల్లనిదే, వాసః = వస్త్రము. (అనఁగా తెల్లని వస్త్రమే శ్రేష్ఠమని యర్థము. ఇట్లె అంతట నెఱుంగవలయును.) వసంత సమయ ఏవ ఋతుః = వసంతకాలమే ఋతువు. శరన్మల్లికాపుష్పం=శరదృతువునందు పూచునట్టి మల్లెయే పుష్పము. (శరన్మాలతీ యని పాఠాంతరము. అప్పుడు శరదృతువునందు పూచునట్టి జాజిపువ్వులు అన్ని పూవులలో శ్రేష్ఠములు అని యర్థము. 'పుష్పేషు జాతీ'యనియున్నది గనుక 'శరన్మాలతీ'యను పాఠమే యుక్తమని తోఁచెడిని.) కుసుమాయుధః ధానుష్కః=మన్మథుఁడే

విలుకాఁడు, కస్తూరికః పరిమళః=కస్తూరికా సంబంధమైనదే పరిమళము, ధనుః అస్త్రం=ధనుస్సే అస్త్రము, తర్కరసోజ్జ్వలావాణీ=తర్కరసముచే ప్రకాశించునదెవాక్కు, శ్యామాప్రియతమా=యౌవన మధ్యస్థయె ప్రియురాలు, యౌవనంవయః = యౌవనమే వయస్సు, శాంకర ఏవమార్గః=శివ సంబంధమైనదే మోక్షమార్గము, పంచమలయాగీతిః = పంచమస్వరముయొక్కలయగలదె పాట, బిల్హణః కవిః=బిల్హణుఁడేకవి.

తా. వస్త్రములలో శుభ్రవస్త్రము, ఋతువులలో వసంతము, పుష్పములలో శరన్మల్లి, ధానుష్కులలో కుసుమాయుధుఁడు, పరిమళములలో కస్తూరీ పరిమళము, అస్త్రములలో ధనుస్సు, మాటలలో తర్కశాస్త్రయుక్తులుగలమాట, ప్రియురాండ్రలో నడివయస్సుది, వయస్సులలో యౌవనము, మోక్షమార్గములలో శంకరమార్గము, పాటలలో పంచమలయగలపాట యెట్లు శ్రేష్ఠములో; అట్లు కవీశ్వరులలో బిల్హణుఁడు శ్రేష్ఠుఁడు.

స దృష్టపూర్వో నాస్మాభిః కుత్రాస్తేఽత్రైవ తిష్ఠతి,
త మిహాహ్వాయ తే త్యుక్తే సమాహూతః స బిల్హణః. 16

టీ. సః=ఆబిల్హణుఁడు, అస్మాభిః=మాచేత, నదృష్టపూర్వః=ఇంతకుముందు ఎన్నఁడును చూడఁబడలేదు; కుత్రాస్తే=ఎక్కడ ఉన్నాఁడు? (అని రాజు అడుగఁగా) అత్రైవ=ఇక్కడనే (ఈపురమందె), తిష్ఠతి=ఉన్నాఁడు, (అనివిద్వాంసులు చెప్పిరి) తం=అతనిని, ఇహ=ఇచటికి, ఆహ్వాయత=పిలువుఁడు, ఇతి=ఇట్లు, (రాజుచేత) ఉక్తే=చెప్పఁబడఁగా, సః బిల్హణః=ఆ బిల్హణుఁడు, సమాహూతః=(విద్వాంసులచే) పిలువఁబడెను.

తా. సుగమము.

ఆగత్య సర్వ బిల్హణనామధేయః
కవిః సుధర్మాఖ్యసభాం ప్రవిశ్య
దదౌ సురేశస్య గురు ర్యథాశిషం
పరాం తథా తస్య మహార్హ మహీపతేః. 17

టీ. మహాన్ = గొప్పపండితుఁడైన, సద్బిల్హణ నామధేయః=బిల్హణుఁడను మంచిపేరుగల, కవిః=కవీశ్వరుఁడు, సుధర్మాఖ్యసభాం=సుధర్మ యనెడు సభను, ప్రవిశ్య=ప్రవేశించి, గురుః=బృహస్పతి, సురేశస్య=ఇంద్రునికి, యథా=ఏప్రకారము, ఆశిషం=ఆశీర్వాదమును, దదౌ=ఇచ్చెనో, తథా=ఆప్రకారము, తస్యమహీపతేః=ఆరాజునకు, పరాం ఆశిషం=శ్రేష్ఠమైన యాశీర్వాదమును, దదౌ=ఇచ్చెను.

తా. ఆబిల్హణుఁడు వచ్చి ఇంద్రుని బృహస్పతి ఆశీర్వదించినట్లు తాను ఆరాజును ఆశీర్వదించెను.

విద్వద్రాజశిఖామణే సుఖ మహో
  సౌఖ్యం ప్రసాదా త్తవ
త్వత్ప్రఖ్యాతి రమీభి రేవ కథితా
  నాస్మాభి రాలోకితా,
కుత్రత్య స్త్వ ముదీర్యతాం కవివ రే
  యత్కాల మస్మిన్ పురే
సన్ విద్యాభ్యసనేన మోద మభజం
  త్వా మద్య సందృష్టవాన్. 18

టీ. విద్వద్రాజశిఖామణే=గొప్పవిద్వాంసులలో శ్రేష్ఠుఁడా (బిల్హణుఁడా), సుఖం=(నీకు) సుఖమా? (అనిరాజు అడిగెను) తవ=నీయొక్క, ప్రసాదాత్=అనుగ్రహమువలన, సుఖం=సుఖము (కలదు అని బిల్హణుఁడు చెప్పెను), త్వత్ప్రఖ్యాతిః=నీప్రసిద్ధి, అమీభిరేవ=వీరిచేతనే (విద్వాంసులచేతనే), కథితా=చెప్పఁబడినది, అస్మాభిః=మాచేత, నాలోకితా=చూడఁబడలేదు (ఇంతకుముందు) తెలియఁబడలేదు. కవివర=కవిశ్రేష్ఠుఁడా! త్వం=నీవు, కుత్రత్యః=ఎక్కడివాఁడవు? ఇయత్కాలం=ఇంతకాలము, అస్మిన్ పురే=ఈపట్టణమందు, సన్=ఉన్నవాఁడనై, విద్యాభ్యసనేన = విద్యలనభ్యసించుటచేత, మోదం=సంతోషమును, అభజం=పొందితిని, త్వాం=నిన్ను,

అద్య=ఇప్పుడు, సందృష్టవాన్ = లెస్సఁగా చూచినవాఁడను. (అనఁగా ఉత్సవాదులయందు నిన్నునేఁ జూచియుండునుగాని ఆ సంభ్రమములలో బాగుగాఁ జూడలేదు. ఇప్పుడు బాగుగాఁ జూచితిని.)

తా. పండితోత్తమా! క్షేమమాయని రాజడుగగా, రాజా నీదయ వలన క్షేమముగా నున్నానని బిల్హణుఁ డనెను; ఆపైన రాజు ఆయ్యా మీసంగతి మీరు చెప్పఁగా తెలిసినది.ఇంతకుముందు మిమ్ము నేఱుఁగను. మీరెక్కడనుండువారు అనిరాజు అడిగెను. అందుకు, రాజా నేనుఈపట్టణములో నేయున్నాను. ఇన్నాళ్లును విద్యాభ్యాసము చేయుచుంటిని. విద్యార్థినిగానుండువాఁడనుగాన నాపేరు ఇంతవఱకు ప్రసిద్ధికి రాలేదు. అందువలన తమకు తెలిసియుండదు.ఇంతకుముందు తమరిని బాగుగాఁజూడలేదు. ఇప్పుడు బాగుగా దర్శనము అయినందున మిగుల సంతోషమైనది అని బిల్హణుఁడు చెప్పెను.

తదా నరేశః కవిపుఙ్గవాయ
కేయూరహారాదిసమస్తభూషాః,
దుకూలవస్త్రద్రవిణాని కామం
దత్త్వోచితం ప్రేషితవాన్ గృహాయ. 19

టీ. తదా=అప్పుడు, నరేశః=రాజు, కవిపుంగవాయ = కవీశ్వరునికొఱకు, కేయూరహారాది సమస్త భూషాః = బాహుపురులు ముత్యాలహారములు మొదలయిన సర్వాభరణములను, దుకూలవస్త్రద్రవిణాని = తెల్లపట్టువస్త్రములను ధనములను, నికామం=ఇష్టము వచ్చినట్లు, ఉచితం=యోగ్యముగా, దత్త్వా=ఇచ్చి, గృహాయ=ఇంటికి, ప్రేషితవాన్=పంపినవాఁడాయెను.

తా. (అతనిని తనకుమార్తెకు విద్యచెప్పుటకై పిలిపించియు ఆసంగతి అతనితో చెప్పక ఆభరణాదులనిచ్చి యింటికి పంపుట యేలననఁగా పైశ్లోకమందుఁ జెప్పునట్టి విధముగా సందేహముగలిగి యీవిషయమై ఆలోచింప

వలయునని యెంచి ప్రస్తుతము అతనితో తనయుద్దేశ్యము చెప్పలేదని తోఁచుచున్నది.)

ఆకారే మదనః సుకావ్యరచనా చాతుర్యయుక్త్యాం గురుః
షడ్భాషాస్వపి దృశ్యతే వ్యసనితా తం దృష్టవత్యః స్త్రియః,
స్వప్రాణేశ్వరసంగమం సుఖతరం త్యక్త్వా న జీవన్త్యహో
తస్యాన్తే క్రియతేఽధునా తనయయాఽభ్యాసః కలానాంకథమ్?

టీ. (మంత్రీ! ఈబిల్హణుఁడు) ఆకారే=చక్కఁదనమందు, మదనః=మన్మథుఁడు (మిక్కిలి అందగాఁడు), సుకావ్యరచనా చాతుర్యయుక్త్యాం-సుకావ్య = మంచికావ్యములను, రచనా=కూర్చుటయందలి,చాతుర్య=నేర్పుయొక్క, యుక్త్యాం=కూడికయందు, గురుః = బృహస్పతి (అనఁగా బృహస్పతివలె మంచికావ్యముల బహుచమత్కారముగ రచియింపఁగలవాఁడు), షడ్భాష్యామపి=(ప్రాకృతము, శూరసేని, మాగది, పైశాచి, చూళికాపైశాచి, అపభ్రంశము అనునట్టిప్రాకృత) భాషలు ఆఱింటియందును,వ్యసనితా=ఎడతెగనిచింతనము (కలవాఁడు), తం = అతనిని, దృష్టవత్యః=చూచినవారైన, స్త్రియః = స్త్రీలు, సుఖతరం = మిక్కిలి సుఖమైన, స్వప్రాణేశ్వరసంగమం=తమప్రాణనాయకుల సంపర్కమును, త్యక్త్వా = విడిచి, నజీవంతి=ప్రాణముల ధరింపఁజాలరు, అహో = అవురా? అధునా=ఇప్పుడు, తస్య=అతనియొక్క, అంతే = సమీపమందు, తనయయా=నాకూఁతురిచేత, కలానాం=విద్యలయొక్క, అభ్యాసః = పరిచయము, కథంక్రియతే=ఎట్లుచేయఁబడును?

తా. అయ్యో మంత్రీ! బిల్హణుఁడు మిగుల చక్కనివాఁడు. శృంగారకావ్యముల రచియించు చాతుర్యము గలవాఁడు. ప్రాకృతభాష లాఱును దెలిసినవాఁడు గావున సామాన్యముగ స్త్రీ లితనిజూచిరేని విరహము నోర్వఁజాలక ప్రాణముల విడుతురు. అవురా? ఇట్టివానియొద్ద నాకూఁతురు యుపతి యెట్లు ధైర్య మవలంబించి చదువఁగలదు అనిభావము.

ధరణీకల్పవృక్షస్య తస్య లావణ్యమఞ్జరీ,
ఆకర్ష త్యాయతాక్షీణా మన్తఃకరణషట్పదాన్. 21

టీ. ధరణీ కల్పవృక్షస్య = భూలోకపు కల్పవృక్షమైన (భూలోకమునం దందఱికన్న శ్రేష్ఠుఁడగు), తస్య = అతనియొక్క, లావణ్యమంజరీ= చక్కఁదన మనియెడు పూలగుత్తి, ఆయతాక్షీణాం = (వాలుగన్నులుగల) స్త్రీలయొక్క, అంతఃకరణషట్పదాన్=మనస్సు లనెడు తుమ్మెదలను, ఆకర్షతి=లాఁగుచున్నది.

తా. ఇతఁడు లోకములో మిగుల నందగాఁడు; ఇతని జూచిన స్త్రీలమనస్సు లితనిపైఁ బోవక మానవు.

ఏవం వదతి రాజేన్ద్రే ప్రధానం నృపమబ్రవీత్,
తథాపి శాస్త్రాభ్యాసోఽస్యా విధేయో నను భూపతే. 22

టీ. రాజేంద్రే=రాజశ్రేష్ఠుఁడు, ఏవంవదతి=ఇట్లు చెప్పుచుండఁగా, ప్రధానం=మంత్రి, నృపం=రాజునుగూర్చి, అబ్రవీత్=పలికెను. భూపతే= రాజా! తథాపి = అట్లైనను (అతఁడు స్త్రీలకు కామమును బుట్టించు వాఁడైనను), అస్యాః = ఈమెకు, శాస్త్రాభ్యాసః = శాస్త్రములఁ బదివించుట, విధేయోనను=చేయఁ దగినపని గదా?

తా. ఇట్లు రాజుచెప్పఁగా మంత్రియనుచున్నాఁడు.—రాజా అతని వలన విద్యాభ్యాసము సరిపడనియెడ మరియొకరివలన నైనను చేయింపవలసినదే గదా? యేమియోజించెదరు? అనెను.

ఏనం వినా న కోఽప్యస్తి మద్దేశే సరసః కవిః,
కిం కుర్మః కపటోపాయః కథ్యతాం నీతికోవిద. 23

టీ. మద్దేశే=నాదేశమునందు, ఏనంవినా=ఇతఁడు దప్ప, కోపి=ఎవ్వఁడును, సరసః=రసికుఁడైన, కవిః=కవి, నాస్తి=లేఁడు. కింకుర్మః = ఏమి చేయుదము? నీతికోవిద = నీతిని జక్కఁగాఁ దెలిసిన మంత్రీ, కపటోపాయః=కపటమైన యుపాయము, కథ్యతాం=చెప్పఁబడుఁ గాక.

తా. రాజు అడుగుచున్నాఁడు.—మంత్రీ ఇతఁడు దప్ప మఱియొకఁడు రసికుఁడైన కవి మనదేశములో లేదు గదా? ఇంక నెట్లుచేయుదము? (అనియడిగి) కపటమైన యుపాయమును పన్నుదము చెప్పుము అనెను.

తయో ర్వ్రతద్వన్ద్వ మి హాస్తి నాన్ధ
ముఖావలోకం కురుతే కుమారీ,
స బిల్హణః కుష్ఠశరీరిదర్శనం
న జాతు కుర్యా దితి చ శ్రుతం విభో. 24

టీ. మంత్రి చెప్పుచున్నాఁడు.— విభో=రాజా! తయోః = వారిద్దఱికిని (మన కుమారికిని, ఆ బిల్హణునకును), వ్రతద్వంద్వం=రెండు వరములు, ఇహ=ఇక్కడ, అస్తి = కలదు. (ఇహ అనఁగా మనము విద్యాభ్యాసముచేయించునట్టి సందర్భములో ననుకూలించునట్టిది అని భావము) కుమారీ = మన కుమారి, అంధముఖావలోకం=గ్రుడ్డివాని మొగముఁజూచుటను, నకురుతే= చేయదు. సబిల్హణః=ఆబిల్హణుఁడు, కుష్ఠశరీరి దర్శనం = కుష్ఠరోగము గల ప్రాణినిఁ జూచుటను, నకుర్యాత్ = చేయఁడు, ఇతిచ=అనియు, శ్రుతం= వినఁబడినది.

తా. రాజా! ఉపాయము కపటముగా పన్నవచ్చును. ఎట్లనఁగా మనకుమారి గ్రుడ్డివానిఁ జూడదు. అతఁడు కుష్ఠరోగిని జూడఁడఁట. ఇట్లువిన్నవాఁడను. (ఈరెండు సందర్భములఁ బట్టి మన ముపాయమును బన్నవచ్చును.

పుత్రీ కుష్ఠగ దేతి బిల్హణకవేరాచక్ష్వ తస్యాః కవిం
జాత్యన్ధం ప్రతిపాదయస్వ నితరాం శ్రుత్వా వచ స్తత్ తవ,
సర్వం విశ్వసతో స్తయో ర్వద పున ర్మధ్యేపి దృగ్రోధకం
బద్ధ్వా కాణ్డపటం దథామి పరతోఽభ్యాసో భవత్వి త్యపి.

టీ. (రాజా) పుత్రీ = (నీ) కొమార్తె, కుష్ఠగదేతి = కుష్ఠరోగము గలదియని, బిల్హణకవేః = బిల్హణ కవికి, ఆచక్ష్వ = చెప్పుము.

తస్యాః = ఆకుమారికి, కవిం = బిల్హణకవిని, జాత్యంధం = పుట్టు గ్రుడ్డివానినిగా, నితరాం = బాగుగా, (నమ్మకము గలుగునట్లుగా - ఈపదము పూర్వవాక్యమునందును అన్వయింపనగు) ప్రతిపాదయస్వ=తెలియఁజేయుము, తవ=నీయొక్క, తద్వచః = ఆమాటను, శ్రుత్వా=విని, సర్వం=నీవు చెప్పినవృత్తాంతమునంతయు, విశ్వసతోః = నమ్ముచున్న, తయోః=వారిద్దఱికి, పునః=తిరిగి, (చెప్పుము) మధ్యే=(మీయిద్దఱి) నడుమ, దృగ్రోధకం= కన్నులనడ్డగించునట్టి, కాండపటం=తెరపట్టను, బద్ధ్వా=కట్టి, దధామిహి= ఉంచుచున్నానుగదా? (ఇటుచేసినయెడ మీకు దోషములేదుగాన)పరతః= ఇఁకమీఁద, విద్యాభ్యాసః=విద్యాభ్యాసము, భవత్విత్యపి=అగునుగాక యనియు, వద=చెప్పుము.

తా. మంత్రియుపాయమును జెప్పుచున్నాఁడు.—రాజా! నీకుమార్తె కుష్ఠరోగముగలదని బిల్హణునకుఁ జెప్పుము. అతఁడు జాత్యంధుఁడని నీకుమారికిఁ జెప్పుము. అప్పుడు నీవు చెప్పినమాటలు వారునమ్ముదురు. ఆపైన వారిద్దఱినడుమ తెరపట్టెగట్టెదనవియు అందువలన దోషము లేదుగనుక విద్యాభ్యాసము జరిగింపుఁడనియు వారికిఁ జెప్పుము. (ఇట్లుచేసినయెడ నొండొరులకు దర్శనముసంభవింపదు. మనము సందేహించినదోషము కలుగుటకు వలనుపడకుండుననిభావము.)

యదుక్తం భవతా మన్త్రిం స్తథైవ క్రియతేఽధునా,
ఇత్యుక్త్వాకారయామాస కుమారీం కోమలాం నృపః. 26

టీ. రాజు చెప్పుచున్నాఁడు.—మంత్రిన్=మంత్రీ! భవతా=నీచేత, యదుక్తం=ఏదిచెప్పఁబడెనో, (అది) అధునా=ఇప్పుడు,తథైవ=అట్లె, క్రియతే=చేయఁబడుచున్నది. ఇత్యుక్త్వా=ఇట్లు మంత్రితోఁజెప్పి, నృపః=రాజు, కోమలా=సుకుమారాంగియు సూక్ష్మబుద్ధియు నగు, కుమారీం = తనకొమార్తెను, ఆకారయామాస=(తనయొద్దకు) పిలిపించెను.

తా. సుగమము.

ఆగత్య సా మన్మథ మన్త్రదేవతా
సమానరూపా పితు ర న్తికే స్థితా,
తాం వీక్ష్య శాస్త్రశ్రవణం విధీయతాం
త్వయా కుమారీ త్యవద న్నరాధిపః. 27

టీ. మన్మథమంత్రదేవతాసమానరూపా=మన్మథునియొక్క మంత్రదేవతతో (అనఁగా మన్మథుఁ డుపాసించునట్టి దేవతఅతిసౌందర్యవతియైనది యనియర్థము.) సమానమైన సౌందర్యముగల, సా=ఆయామినీపూర్ణతిలక, ఆగత్య=వచ్చి, పితుః=తండ్రియొక్క, అంతికే=సమీపమందు, స్థితా=నిలిచియుండినది, నరాధిపః=రాజు, తాం=ఆకుమారిని, వీక్ష్య=చూచి, కుమారీ =కుమారీ, త్వయా=నీచేత, శాస్త్రశ్రవణం=శాస్త్రములవినుట, విధీయతాం=చేయఁబడుఁగాత (నీవు శాస్త్రములవినుము), ఇతి=ఇట్లు, అవదత్= చెప్పెను.

తా. మిగుల చక్కనిదైన తనకుమార్తె తనయొద్దకురాగా రాజు పుత్రీ నీవు శాస్త్రములను గురువునొద్దఁ జదువుకొనుమని చెప్పెను.

జాత్యన్ధో హి బుధశ్రేష్ఠో బిల్హణాఖ్యోఽస్తి మత్పురే,
త స్యాన్తే క్రియతాం సర్వశాస్త్రాభ్యాస స్త్వయా సుతే.

టీ. సుతే=పుత్రీ ! జాత్యంధః=పుట్టుగ్రుడ్డివాఁడైన, బిల్హణాఖ్యః= బిల్హణుఁడనుపేరుగల, బుధశ్రేష్ఠః=గొప్పపండితుఁడు, మత్పురే=నాపట్టణమునందు, అస్తి=కలఁడు, తస్య=అతనియొక్క, అంతే=సమీపమందు, త్వయా=నీచేత, శాస్త్రాభ్యాసః = శాస్త్రపరిచయము, క్రియతాం=చేయఁబడుఁగాక.

తా. అమ్మాయి నాపట్టణమందు పుట్టు గ్రుడ్డియైన బిల్హణుఁడనుపేరుగల మహాపండితుఁడు గలఁడు, అతనియొద్ద నీవు శాస్త్రములను జదువుకొనుము.

కి మేత దన్ధకముఖం న పశ్యా మీాతి మే వ్రతమ్,
తదా చే ద్యువయోర్మధ్యే కాణ్డం దాస్యామి యత్నతః. 29

టీ. కిమేతత్ =ఇదియేమి, అంధకముఖం=గ్రుడ్డివానిముఖమును, నపశ్యామీాతి=చూడని, మే=నాయొక్క, వ్రతం=నియమము, (అనికూఁతురుచెప్పెను) తథాచేత్ =అట్లైతే,యువయోర్మధ్యే=మీాయిద్దఱినడుమ, కాండం=తెరను, యత్నతః = ప్రయత్నముతో, (అనఁగా అతఁడు నీ కగుపడకుండ దృఢముగా) దాస్యామి=కట్టించియుంచెదను.

తా. నాయనా! నేగ్రుడ్డివానిఁజూడనను వ్రతముగలదాననుగాన నతనియెుద్దఁ జదువుట యెట్లు సంభవించునని కుమార్తె అడిగెను. అందుకు అమ్మా! మీాయిద్దఱినడుమ గట్టిగా తెరపట్ట కట్టియుంచెద నని తండ్రి చెప్పెను.

ఇ త్యఙ్గీకృతవత్యాం తస్యా మబ్రూత బిల్హణం నృపతిః,
కుష్ఠగదాం మత్పుత్రీం సర్వకళాకోవిదాం విధే హీతి. 30

టీ. తస్యాం=ఆకుమారి, ఇతి = ఇట్లు, (అనఁగా తెరపట్టకట్టినయెడ సమ్మతమేయని) అంగీకృతవత్యాం=ఒప్పుకొనినదియగుచుండఁగా, నృపతిః=రాజు, బిల్హణం=బిల్హణునిగూర్చి, కుష్ఠగదాం=కుష్ఠరోగముగల, మత్పుత్రీం=నాపుత్రిని, సర్వకళాకోవిదాం=అన్నివిద్యలయందును మంచిజ్ఞానముగలదానినిగా, విధేహీతి=చేయుమని, అబ్రవీత్ =చెప్పెను.

తా. సుగమము.

సా ధూక్తం నృపశేఖర
క దాపి వీక్షే న కుష్ఠరోగిముఖమ్,
భూయా న్నామ మహాత్మ
మధ్యే దాస్యామి వాం తిరస్కరిణీమ్. 31

టీ. నృపశేఖర=రాజశ్రేష్ఠుఁడా! సాధు=లెస్సఁగా, ఉక్తం=చెప్పఁబడెను,(అనఁగానీవుచెప్పినదిసరిపడదు ఏలననఁగా) కదాపి=ఎన్నఁడును,కుష్ఠ

రోగిముఖం=కుష్ఠరోగముగలవానిముఖమును, నవీక్షే = చూడను. (అని బిల్హణుఁడుచెప్పెను) మహాత్మన్=మహానుభావా! భూయాన్నామ=(నీవ్రతము అట్లైు) ఉండునుగాక.(దాని నే చెఱుపఁగోరను)వాం = మీయిద్దఱియొక్క, మధ్యే = నడుమ, తిరస్కరిణీం=తెరను, దాస్యామి=ఇచ్చెదను (అని రాజు చెప్పెను).

తా. రాజా నేనుకుష్ఠరోగిముఖమును జూచుటలేదను వ్రతముగలవాఁడనే యీకార్యమెట్లుజరుగును అని బిల్హణుఁడుచెప్పఁగా మీయిద్దఱినడుమ తెరగట్టించెదనని రాజు సమాధానపఱిచెను.

రాజంస్త్వయైవం నిర్బన్ధః క్రియతే కిం కరోమ్యహమ్,
తథా యది యథాశక్తి విద్యాం దాస్యామి భూపతే. 32

టీ. రాజన్=రాజా, త్వయా=నీచేత, ఏవం=ఈప్రకారము,నిర్బంధః=బలవంతకార్యము, క్రియతే=చేయఁబడుచున్నది. అహం=నేను, కిం కరోమి=ఏమిచేయఁగలను? భూపతే=రాజా! తథాయది=అట్లేజరుగవలసిన యెడ, యథాశక్తి = శక్తిగలమట్టుకు, విద్యాం = విద్యను, దాస్యామి = ఇచ్చెదను.

తా. రాజా! నేను కుష్ఠరోగులముఖముఁజూడని వ్రతముగలవాఁడనైనను తెరచాటుననుండియైన విద్యచెప్పవలయునని బలవంతపఱచుచున్నావు. అది నాకు సమ్మతముకానిదైనను నీయిష్టము ననుసరింపవలెను గనుక ప్రత్యక్షముగా చెప్పుటలో ఎంతజ్ఞానముగలుగునో అంతజ్ఞానము చాటుననుండి చెప్పుటవలన గలుగదు. నాశక్తికొలఁది బాగుగా తెలియునట్లు బోధించెదను.

ఇతి తస్య వచః శ్రుత్వా నృపః ప్రేష్య కవిం గృహమ్,
మన్త్రింస్త్వయోదితోపాయః సిద్ధోఽభూదిత్యభాషత. 33

టీ. నృపః=రాజు, ఇతి=ఇట్లు, తస్య=అతనియొక్క, వచః=మాటను, శ్రుత్వా=విని, కవిం=కవిని, గృహం=ఇంటికి, ప్రేష్య=పంపి, మంత్రిన్=మంత్రీ! త్వయా=నీచేత, ఉదితోపాయః = చెప్పఁబడినయుపాయము, సిద్ధః=నెఱవేఱినదిగా, అభూదితి=ఆయెనని, అభాషత=పలికెను.

తా. సుగమము.

తతః సమాకార్య నిమిత్తకోవిదాన్
ముహూర్త మాలోచ్య శుభఙ్కరం వరమ్,
విధాయ గేహం బహుచిత్రచిత్రితం
తదన్తరే కాణ్డపటం న్యబన్ధయత్. 34

టీ. తతః=తరువాత, నిమిత్తకోవిదాన్=మంచిజ్యోతిష్కులను,సమాకార్య=పిలిపించి, శుభంకరం=మేలుగలుగునట్టి, వరం=శ్రేష్ఠమైన, ముహూర్తం=మహూర్తమును, ఆలోచ్య=ఆలోచించి, గేహం=ఇంటిని, బహుచిత్రచిత్రితం=అనేకములైనచిత్తరువులచేత నలంకరింపఁబడినదానినిగా, విధాయ=చేసి, తదంతరే=ఆయింటియందు, కాండపటం=తెరపట్టను, న్యబంధయత్=కట్టించెను.

తా. తరువాత రాజు మంచి జ్యోతిష్కులరావించి మంచిముహూర్తమును పెట్టించి ఇంటినలంకరించి ఆయింటిలో తెరపట్ట కట్టించెను.

తత్రాగత్య నరాధిపః శుభదినే-
మాత్యాన్ కవీన్ద్రాన్ బుధాన్
దృష్ట్వా తాం స్వసుతాం చ బిల్హణకవిం
శీఘ్రం సమానాయయత్,
వాగ్దేవీపరిపూజనం ప్రథమతః
కృత్వా చ రామాయణ
ప్రారమ్భం కృతవాన్ స బిల్హణకవిః
సానుగ్రహః సత్కృతః. 35

టీ. నరాధిపః=రాజు, శుభదినే=మంచిదినమందు, తత్ర=అలంకరించియున్న యాయింటికి, ఆగత్య=వచ్చి, అమాత్యాన్ = మంత్రులను, కవీంద్రాన్=కవీశ్వరులను, బుధాన్=విద్వాంసులను, దృష్ట్వా=చూచి, తాం స్వసుతాం=ఆ తనకుమార్తెను, బిల్హణకవిః=ఆబిల్హణకవినిని, శీఘ్రం=త్వరగా, సమానాయయత్=రప్పించెను. సబిల్హణకవిః=ఆబిల్హణకవి, సత్కృ

తః=పూజింపఁబడినవాఁడై, సానుగ్రహః=అనుగ్రహముతోఁగూడినవాఁడై, ప్రథమతః=తొలుత, వాగ్దేవీపరిపూజనం=సరస్వతీదేవిని చక్కఁగాఁ బూజించుటను, కృత్వా=చేసి, రామాయణప్రారంభంచ=బాలరామాయణమును ప్రారంభించుటను, కృతవాన్=చేసెను.

తా. రాజు శుభదినమందు విద్యారంభముచేయు గృహమునకువచ్చి మంత్రులు కవీశ్వరులు పండితులు మొదలగు వారితోఁ గూడినవాఁడై తన కౌమార్తెను, బిల్హణ కవిని పిలిపించి యతనిని సత్కరించెను. అంత నతఁడు మిగుల సంతోషించినవాఁడై సరస్వతీ పూజచేసి శ్రీరామాయణమునందలి ప్రథమసర్గమును ప్రారంభించెను. ఆసర్గమునకే బాలరామాయణ మనిపేరు.

తతశ్చ రాజా సర్వేషాం బుధానాం వసువాహనమ్,
వస్త్రాదీ నుచితం దత్త్వా స్వగృహాన్ ప్రాహిణోత్ తదా.36

టీ. తతశ్చ = తరువాత, రాజా=రాజు, సర్వేషాంబుధానాం = విద్వాంసులందఱికిని, వస్త్రాదీన్=వస్త్రములు మొదలగువానిని, ఉచితం=వారివారికితగినట్లు, దత్త్వా=ఇచ్చి, తదా=అప్పుడు, స్వగృహాన్=తమయిండ్లకు, ప్రాహిణోత్ = పంపెను.

తత్రానయో ర్నరపతి ర్వర భోజ్య జాలం
తామ్బూల వస్త్ర శయ నాసన సంహతిం చ,
దత్త్వోత్తమాం ప్రతిదిన నియమేన శాస్త్రా
భ్యాసం విధత్త మితి తుష్టమనా దిదేశ. 37

టీ. నరపతిః=రాజు, తత్ర=అచ్చట, అనయోః=వీరిద్దఱికి (తన కౌమార్తెకును బిల్హణునికిని),వరభోజ్యజాలం=మంచిభోజ్యపదార్థముల మొత్తమును, ఉత్తమాం=శ్రేష్ఠమైన, తాంబూలవస్త్రశయనాసనసంహతించ = తాంబూలములయొక్కయు, వస్త్రములయొక్కయు, శయనముల (పడకల) యొక్కయు, ఆసనముల (పీఠముల) యొక్కయు సమూహమును,

దత్త్వా=ఇచ్చి, ప్రతిదినం=ప్రతిదినమందును, నియమేన=నియమముతో, శాస్త్రాభ్యాసం=శాస్త్రములఁ జదువుటను, విధత్తమితి=చేయుఁడియని, తుష్ట మనాః=సంతోషించిన మనస్సుగలవాఁడై, దిదేశ=ఆజ్ఞాపించెను.

తా. రాజు మిగుల సంతోషించినవాఁడై, వారిద్దరికిని మంచిభోజన పదార్థములను శ్రేష్ఠములయిన తాంబూలవస్త్రశయనాసనాదులను ఇచ్చి ప్రతిదినము తప్పకుండ విద్యాభ్యాసము చేయుఁడియని ఆజ్ఞాపించెను.

తదాది బిల్హణకవిః సర్వశాస్త్రాణి సర్వదా,
బోధయామాస విధివ ద్రాజపుత్రీం మనోహరమ్. 38

టీ. తదాది=అదిమొదలుకొని, బిల్హణకవిః=ఆబిల్హణకవి, రాజపుత్రీం=రాజకొమార్తెకు, సర్వశాస్త్రాణి = సకలశాస్త్రములను, సర్వదా=ఎల్లప్పుడును, విధివత్=నియమముతప్పకుండునట్లు, మనోహరం=(ఆరాజకుమారి మనస్సునకు) ఉల్లాసము గలుగునట్లు, బోధయామాస=తెలియఁజేసెను.

తా. సుగమము.

నానాలంకారశాస్త్రే నవరసభరితే భావసంరమ్భయుక్తే
కావ్యే నానార్థశాస్త్రే సుజనబహుమతే నాటకేచ ప్రశస్తే,
స్వాచ్ఛే చ్ఛన్దోబ్ధిపూరే బహుసుఖవిషయే కామదే కామశాస్త్రే
ప్రౌఢాసీ ద్బిల్హణాదప్యధికమతియుతా రాజపుత్రీ పవిత్రా.

టీ. పవిత్రా=పవిత్రురాలైన, (అనఁగా మనస్సు తమోగుణములేక స్వచ్ఛముగా నుండునది గనుక సకల విషయములను సుకరముగా గ్రహించునది యనియర్థము.) రాజపుత్రీ=రాజుకొమార్తె, నవరసభరితే=శృంగారాది నవరసములతో నిండియున్న, (అనఁగా నలంకారశాస్త్రమునందు రసమును ముఖ్యముగా గ్రహించి గుణాలంకారములను తదుపస్కారములుగా నుపపాదించియున్నారు గనుక రసములే నిండియున్నవి యనిభావము.) నానాలంకారశాస్త్రే=అనేకములైన యలంకార శాస్త్రములందును, (అలంకారమనఁగా సౌందర్యము. కావ్యసౌందర్యమును వర్ణించుశాస్త్రమలంకారశాస్త్రము

నాఁబడు)భావసంరంభయుక్తే-భావ=వ్యంగ్యార్థములయొక్క, సంరంభ=వేగిరపాటుతో, యుక్తే=కూడుకొనిన, (అనఁగా పైఁబైన స్ఫురించునట్టి భావములు గలిగినట్టి)కావ్యే=కావ్యమునందును, (జాత్యేకవచముగాన కావ్యములందనియర్థము) సుజనబహుమతే=సజ్జనులకిష్టమైన, నానార్థశాస్త్రే=అనేకవిధములయిన యర్థశాస్త్రములందును, ప్రశస్తే=ప్రసిద్ధమైన, నాటకేచ=నాటకమందును, స్వచ్ఛే=స్వచ్ఛమైన, అనఁగా ఛందస్సువలన వాఙ్మయము లేటగా వచింపనగును) బహుసుఖవిషయే = అనేకములైన సుఖమును జేయునట్టివైనభోగములుగల, కామదే=కోరికలనిచ్చునట్టి (అనఁగా కోరినట్లు సుఖింపఁజేయునట్టి), కామశాస్త్రే=కామశాస్త్రమందును, బిల్హణాదపి=(తన గురువైన) బిల్హణుని కన్నను, అధిక మతియుతా=ఎక్కువబుద్ధి గలదియును, ప్రౌఢా=(తాను తెలిసికొనిన యర్థముల నుపన్యసించుటయందు) దిట్టతనము గలదియును, ఆసీత్=ఆయెను.

తా. మిగుల సూక్ష్మ బుద్ధిగల యారాజకుమారి యలంకారాది సర్వసాహిత్యశాస్త్రములందును తన గురువుకన్న మిక్కిలి తెలివి గలదిగను చాతుర్యము గలదిగను ఆయెను.

అథైకదా కామసహాయభూత
స్తారాభికః శారదపూర్ణిమాయామ్,
వికాసయన్ సర్వదిశాం ముఖాని
సమారురో హేన్ద్రదిశం శశాఙ్కః. 40

టీ. అథ=తరువాత, ఏకదా=ఒకప్పుడు, శారదపూర్ణిమాయామ్=శరదృతుపూర్ణిమయందు, కామసహాయభూతః-కామ=మన్మథునికి, సహాయభూతః=సహాయుఁడై, (అనఁగా చంద్రదర్శనము కామోద్దీపకమనిభావము) తారాభికః = నక్షత్రములకు నాయకుఁడైన, శశాంకః = చంద్రుఁడు, సర్వదిశాం = సకలదిక్కులయొక్క, ముఖాని=కొనలను, వికాసయన్=ప్రకాశింపఁజేయుచున్నవాఁడై, ఇంద్రదిశం = తూర్పుదిక్కును, సమారురోహ=ఎక్కెను.

తా. పూర్వశ్లోకమునందుఁ జెప్పఁబడినట్లు అలంకారాది సకల శాస్త్రములను చదువుకొని మిక్కిలి చాతుర్యముఁగలదై యుండఁగా, శరత్కాలమందుఁ బూర్ణిమనాఁడు చంద్రుఁ డుదయించుచుండెను. అప్పుడు, నక్షత్రములు ప్రకాశించుచుండెను. సకల దిక్కులును వికసిల్లుచుండెను. తరుణులకుఁ గామ మతిశయించుచుండెను.

మార నారాచ నిశ్శాణ శాణోపల మి వోదితమ్,
యామినీ కామినీ కర్ణకుణ్డలం చన్ద్రమణ్డలమ్. 41

టీ. యామినీ...లం-యామినీ=రాత్రియనెడు, కామినీ=యువతికి, కర్ణకుండలం=కర్ణాభరణమైన, చంద్రమండలం=చంద్రబింబము, మార... పలం-మార=మన్మథునియొక్క, నారాచ=బాణములయొక్క, నిశ్శాణ=పదునుగలుగుటకై రాచునట్టి, శాణోపలమివ = సానఱాయివలె, ఉదితమ్=ఉదయించినది.

తా. ఆ ఉదయించిన చంద్రబింబము రాత్రియనెడు స్త్రీధరించిన చెవికమ్మవలెను మన్మథుని బాణములను పదనుఁబెట్టుటకై యేర్పడినసానవలెను ప్రకాశించుచుండెను. అనఁగా మిక్కిలియందముగను, కామోద్దీపకముగను నుండెనని భావము.

ఇదం కుముదభేదనం మదనమాన్ద్యవిచ్ఛేదనం
వియత్తిమిరవారణం విరహికామినీమారణమ్,
సముల్లసతి సున్దరా దుదయకన్దరా దైన్దవం
పురన్దరదిగిన్దిరాశ్రవణకుణ్డలం మణ్డలమ్. 42

టీ. ఇదం=ఈ, ఐందవమండలమ్ = చంద్రమండలము, కుముదభేదనమ్=తెలకలువలను వికసింపఁజేయునదియును, మద...దనమ్ - మదన=మన్మథునియొక్క, మాంద్య = ఆలస్యమును, విచ్ఛేదనం = పోఁగొట్టునదియును, వియ...రణమ్-వియత్ = ఆకాశమండలి, తిమిర=చీఁకటిని, వారణమ్=పోఁగొట్టునదియును, విర...రణమ్-విరహి = విరహముఁగల, కామి

ని=స్త్రీలను, మారణం=చంపునదియును, పుర...దలమ్—పురందర=ఇంద్రునియొక్క, దిక్=దిక్కునే, ఇందిర=లక్ష్మికి, శ్రవణకుండలమ్=కర్ణాభరణమైనదియునై, సుందరాత్=సుందరమైన, ఉదయకందరాత్ = ఉదయపర్వతగుహనుండి, సముల్లసతి=ఉదయించుచున్నది.

తా. చంద్రుఁడు తూర్పుదిక్కున ఉదయించుచున్నాఁడు. దానివలనఁ దెల్లగలువలు వికసించుచున్నవి. కామము వర్ధిల్లుచున్నది. ఆకసమునందు చీఁకటియంతయుఁ బోవుచున్నది. విరహముగల కామినులు చరమావస్థను బొందుచున్నారు.

స్వైరం కైరవకోరకా న్విదళయన్
యూనాం మనః ఖేలయ
న్నమ్భోజాని నిమీలయ న్మృగదృశాం
మానం సమున్మూలయన్,
జ్యోత్స్నాం కన్దళయ న్దిశో ధవళయ
న్నమ్భోధి ముద్వేలయన్
కోకా నాకులయ న్తమః కబళయ
న్నిన్దుః సముజ్జృమ్భతే. 43

టీ. ఇందుః=చంద్రుఁడు, స్వైరం = ఇచ్చవచ్చినటు, కైరవకోరకాన్ = తెల్లఁగలువమొగ్గలను, విదళయన్=వికసింపఁజేయుచున్నవాఁడై, యూనాం=తరుణులయొక్క, మనః=మనస్సును, ఖేలయన్ = విహరింపఁజేయుచున్నవాఁడై, అంభోజాని=కమలములను, నిమీలయన్ = ముకుళింపఁజేయుచున్నవాఁడై, మృగదృశాం = స్త్రీలయొక్క, మానం = ప్రణయకోపమును, సమున్మూలయన్ =పోఁగొట్టుచున్నవాఁడై, జ్యోత్స్నాం=వెన్నెలను, కందళయన్ = మొలకలెత్తించుచున్నవాఁడై, దిశః = దిక్కులను, ధవళయన్ = తెల్లఁగాఁ జేయుచున్నవాఁడై, అంభోధిం=సముద్రమును, ఉద్వేలయన్ = కట్టను దాఁటించుచున్నవాఁడై, తమః = చీఁకటిని, కబళయన్=మ్రింగుచున్నవాఁడై, సముజ్జృంభతే=పైకివచ్చుచున్నాఁడు.

తా. చంద్రుఁ డుదయించు నప్పుడు తెలకలువలు వికసించుచున్నవి. తరుణుల మనంబులకు నుల్లాసముఁ గలుగుచున్నది. తామరలు ముకుళించు చున్నవి. యువతులు ప్రణయకోపమును విడిచి ప్రియులతోఁ గూడుకొను చున్నారు. వెన్నెల క్రమముగా వృద్ధినొందుచున్నది. చుక్కలు తెల్లగాఁ బ్రకాశించుచున్నవి. సముద్రము పొంగుచున్నది. చక్రవాకములు కలతపడు చున్నవి. చీఁకటి నశించి పోవుచున్నది.

శయ్యాగేహే శయనతలగో బిల్హణః సోఽథ పూర్ణం
చన్ద్రం దృష్ట్వా నయనసుభగం జాలమార్గేణ భాన్తమ్,
పృథ్వీచక్రే విరహివితతేః కామసంతాపబీజం
చేతోజాతాకులితహృదయో వర్ణయామాస తూర్ణమ్. 44

టీ. అథ=తరువాత, సః బిల్హణః=ఆబిల్హణుఁడు, శయ్యాగేహే=పడక టింటియందు, శయనతలగః = పానుపుమీఁదనున్న వాఁడై, జాలమార్గేణ= గవాక్షమార్గముచేత, పృథ్వీచక్రే=భూమండలమందు, విరహివితతేః = విరహ ముగలవారి సమూహమునకు, కామసంతాపబీజం = కామజ్వరమునకు కారణ మైన వాఁడును, నయనసుభగం=నేత్రములకు ఆనందముఁ గలిగించువాఁడును ఆయిన, పూర్ణచంద్రం=పూర్ణచంద్రుని, దృష్ట్వా=చూచి, చేతో...ద యః-చేతోజాత=కామముచేత, ఆకులిత=కలతఁబెట్టఁ బడిన, హృదయః = మనస్సుఁగవాఁడై, తూర్ణం=శీఘ్రముగా, వర్ణయామాస=వర్ణించెను.

తా. తరువాత బిల్హణుఁడు తనపడకటింటిలో పాన్పుపైఁ బండు కొని యుండి ఉదయించిన చంద్రుని గవాక్షమార్గమునఁ జూచి, మిగుల కామముచేత మనంబునఁ గలఁతనొంది వెంటనే యిట్లు వర్ణించెను.

నక్షత్రేశ త్వదుదరగతం చిహ్న మేకే వటద్రుం
భాషన్తే ఽన్యే శశక మపరే కోమలాఙ్గం చమూరుమ్,
మన్యే కాన్తాధరదళవిధా వగ్రహీత్ కుక్షిసంస్థం
తత్పీయూషం తవ విధి రహో జాల మాసీత్ తదేతి. 45

టీ. నక్షత్రేశ=చంద్రుఁడా! త్వదుదరగతం = నీకడుపులోనున్న, చిహ్నం = గురుతును, ఏకే=కొందఱు, వటద్రుం=మఱ్ఱిచెట్టునుగా, భాషంతే = చెప్పుచున్నారు. అన్యే = ఇతరులు, శశకం = కుందేటినిగా, భాషంతే. అపరే=మఱికొందఱు,కోమలాంగం = సుకుమారమైన దేహముగల, చమూరుం =లేడినిగా, భాషంతే. విధిః = బ్రహ్మ, కాంతాధరదళవిధౌ-కాంతా=ప్రియురాలియొక్క, అధరదళ=చిగురువంటి క్రిందిపెదవిని, విధౌ=చేయుటయందు, తవ = నీయొక్క, కుక్షిసంస్థం = కడుపులోనున్న, తత్పీయూషం= ఆయమృతమును, అగ్రహీత్=తీసికొనెను, తదా=అప్పుడు,జాలం=రంధ్రము, ఆసీత్ = ఆయెను, ఇతి = ఇట్లు, మన్యే=తలంచుచున్నాను.

తా. చంద్రుఁడా! నీయందుఁ గనుపడు నల్లనిగురుతు నాప్రియురాలి యధరమును నిర్మించుటకయి నీలోనియమృతమును తీసికొనఁగా నేర్పడిన రంధ్రమేగాని వారువారన్నట్లు మఱ్ఱిచెట్టుకాదు, కుందేలుగాదు, లేడికాదు.

నేదం నభోమణ్డల మమ్బురాశి
ర్నేమాశ్చ తారా నవఫేనఖణ్డాః,
నాయం శశీ కుణ్డలితః ఫణీన్ద్రో
నాయం కళఙ్కః శయితో మురారిః. 46

టీ. ఇదం=ఇది, నభోమండలం=ఆకాశమండలము, న=కాదు. అంబురాశిః = సముద్రము. ఇమాశ్చ = ఇవియు, తారాః = నక్షత్రములు, న= కావు. నవఫేనఖండాః = క్రొత్తనురుగుతునియలు. అయం = ఇతఁడు, శశీ= చంద్రుఁడుఁ న=కాడు. కుండలితః=చుట్టుకొనియున్న, ఫణీంద్రః=శేషుఁడు. అయం=ఇది, కళంకః = మచ్చ, న =కాదు. శయితః = పండుకొనియున్న, మురారిః=విష్ణుమూర్తి.

తా. ఆకసము సముద్రమువలెను, నక్షత్రములు నురుగుతునియలవలెను, చంద్రుఁడు చుట్టుకొనియున్న శేషునివలెను, కళంకము ఆశేషునిపైఁ బవ్వళించియున్న విష్ణుమూర్తివలెను ప్రకాశించుచున్నవి.

అఙ్కం కేఽపి శశఙ్కిరే జలనిధేః పఙ్కం పరే మేనిరే
సారఙ్గం కతిచిచ్చ సంజగదిరే భూచ్ఛాయ మైచ్ఛన్ పరే,
ఇన్దౌ య ద్దళితేన్ద్రనీలశకలశ్యామం దరీదృశ్యతే
తత్ సాన్ద్రం నిశి పీత మన్ధతమసం కుక్షిస్థ మాచక్ష్మహే.

టీ. ఇందౌ = చంద్రునియందు, దళి...శ్యామం - దళిత = పగులఁగొట్టఁబడిన, ఇంద్రనీల=ఇంద్రనీలరత్నముయొక్క, శకల=పలుకువలె, శ్యామం=నల్లనైన, యత్=ఏది, దరీదృశ్యతే=మిక్కిలికనఁబడుచున్నదో, తత్=దానిని, కేఽపి=కొందఱు, అంకమ్=కళంకమునుగా, శశంకిరే=భ్రమపడిరి. పరే=ఇతరులు, జలనిధేః=సముద్రముయొక్క, పంకం=బురదనుగా, మేనిరే=తలంచిరి. కతిచిచ్చ = కొందఱు, సారంగం = లేడినిగా, సంజగదిరే=చెప్పిరి. పరే=ఇతరులు, భూచ్ఛాయం = భూమినీడనుగా, ఐచ్ఛన్ = తలంచిరి. (మేము) నిశి = రాత్రియందు, పీతం = త్రాగఁబడిన, అంధతమసమ్=కటికచీఁకటిని, కుక్షిస్థమ్=కడుపులోనున్నదానినిగా, ఆచక్ష్మహే = చెప్పుచున్నాము.

తా. చంద్రునిలోనినలుపును కొందఱు మచ్చయని, మఱికొందఱు సముద్రములోని బురదయని, ఇతరులు లేడియని, అన్యులు భూచ్ఛాయ అని చెప్పుచున్నారుకాన అది అట్లుకాదు.రాత్రిపూఁట త్రాగినకటికచీఁకటి యంతయు కడుపులోచేరి కనఁబడుచున్నదని మేము తలంచెదము.

ప్రాచీభాగే సరాగే దరిణి విరహిణి క్రాన్తముద్రే సముద్రే
నిద్రాళౌ నీరజాళౌ ధృతముది కుముదే కోకలోకే సశోకే,
ఆకాశే సావకాశే తమసి చ శమితే నిర్వికారే చకోరే
కన్దర్పేఽనల్పదర్పే వికిరతి కిరణాన్ శర్వరీసార్వభౌమః. 48

టీ. ప్రాచీభాగే=తూర్పు చోటు, సరాగే=ఎఱుపుతోఁ గూడుకొన్నదగుచుండఁగా, విరహిణి=విరహముగల స్త్రీపురుషులు, దరిణి=భయపడుచుండఁగ, సముద్రే=సముద్రము, క్రాంతముద్రే = మితిమీఱుచుండఁగ, నీర

జాళే=తామరలచాల్వు, నిద్రాతి=నిద్రించుచుండఁగా, కోకలోకే=జక్కవల మొత్తము, సశోకే=శోకముగలది అగుచుండఁగా, కుముదే=తెల్లగలువ, ధృతముదీ=సంతోషమును ధరించుచుండఁగా, ఆకాశే=ఆకాశము, సావకాశే=తెరపగుచుండఁగా, తమసిచ=చీఁకటి, శమితే=అణఁగిపోవఁగా, చకోరే=వెన్నెలపులుఁగు, నిర్వికారే = కలఁతలేనిదగుచుండఁగా, కందర్పే=మన్మథుఁడు, అనల్పదర్పే=మిక్కిలిపొగరుఁబట్టియుండఁగా, శర్వరీసార్వభౌమః = రేరాజు, కిరణాన్ = కిరణములను, వికిరతి=వెదఁజల్లుచున్నాఁడు.

తా. చంద్రుఁ డుదయించునపుడు కిరణములు వ్యాపించుచుండఁగా తూర్పు దెస ఎఱ్ఱబాఱుచున్నది. సముద్ర ముప్పొంగుచున్నది. తెల్లగలువలు వికసించుచున్నవి. చక్రవాకములు శోకపడుచున్నవి. ఆకాశము తెరపైనది. చకోరములు సంతసించుచున్నవి. కామము పెల్లుమీఱుచున్నది.

చన్ద్రమణ్డలసురఙ్గయా జగ
న్మన్దిరే మదనదస్యు రుత్థితః,
మానవిత్త మపహర్తు ముద్ధుతా
మోహభస్మకలి కేవ కౌముదీ. 49

టీ. మదనదస్యుః = మన్మథుఁడనుదొంగ, చంద్రమండలసురఙ్గయా=చంద్రమండలమను సురంగముచేత, జగన్మందిరే=లోకమను నింటియందు, ఉత్థితః = దూఱివచ్చినవాఁడు. కౌముదీ=వెన్నెల, మానవిత్తం=ప్రణయకోపమను ధనమును, అపహర్తుం=దొంగిలించుటకు, ఉద్ధుతా=చల్లఁబడిన, మోహభస్మకలికేవ=మచ్చుపొడి కలికయో యను నట్లున్నది.

తా. చంద్రమండలమునుజూడఁగానే విరహిజనులకుఁ గామము వృద్ధినొంది ప్రణయకోపమును విడిచినవారై వెన్నెలయందె మోహపరవశులయిరి.

ఆకాశశాణే శరదాఽభిరామే
రాశీకృతం చన్దన మిన్దుబిమ్బమ్,
తదన్తరాలోడయితుం వికీర్ణః
కస్తూరికారేణు రయం కళఙ్కః. 50

టీ. ఇందుబింబం=చంద్రమండలము, శరదా=శరదృతువుచేత, అభిరామే=ఒప్పుచున్న, ఆకాశశాణే=ఆకసముఅనెడు సానయందు, రాశీకృతం=ముద్దఁగాఁ జేయఁబడిన, చందనం=గంధము, అయంకళంకః = ఈమచ్చ, తదంతః=దానిలో, ఆలోడయితుం=కలువుటకు, వికీర్ణః=చల్లఁబడిన, కస్తూరికారేణుః=కస్తూరిపొడుము.

తా. ఆకసము సానవలెను, చంద్రుఁడు రాశిగాఁజేయఁబడిన చందనమువలెను, కళంకము దానిలో మెదగుటకయి పైనఁజల్లిన కస్తూరిపొడివలెను ప్రకాశించుచున్నది.

ఆకాశవాపీఘనపుణ్డరీకం
శాణోపలం మన్మథసాయకానాం,
ప శ్యోదితం శారద ముత్పలాక్షి
సంధ్యేన్దిరాకన్దుక మిన్దుబిమ్బమ్. 51

టీ. ఆకా...రీకం-ఆకాశవాపీ=ఆకసమను నడబావియందలి, ఘనపుండరీకం=పెద్ద తెల్లదామరగాను, మన్మథసాయకానాం = మన్మథబాణములకు, శాణోపలం=సానరాయిగను, సంధ్యేన్దిరాకందుకం=సంధ్యాలక్ష్మికి చేబంతిగనుండిన, ఉదితం=ఉదయించిన, శారదం-ఇందుబింబం=శరత్కాలచంద్రుని, ఉత్పలాక్షి=కలువలవంటి కన్నులుగలదానా! పశ్య=చూడుము.

తా. కలువకంటీ! చూచితివా ఈచందమామను. ఆకసమనుబావికి తెల్లదామరగనున్నాఁడు. కామమును వృద్ధిఁబొందించుచున్నాఁడు.

క్వ కాణః? క్వ కళఙ్కీ చ? కథం వా తస్య వర్ణనమ్!,
ఇతః పరం కి మాశ్చర్యం? కథం సంపద్యతా మిదమ్?. 52

టీ. కాణః=గ్రుడ్డివాఁడు, క్వ=ఎక్కడ? కళంకీచ = చంద్రుఁడును, క్వ=ఎక్కడ? తస్య=ఆతని(యొక్క)ని, వర్ణనంవా=వర్ణించుటగాని, కథం=ఎటు ? ఇతఃపరం=దీనికంటె, ఆశ్చర్యం=వింత, కిమ్=ఏమిగలదు ? ఇదం=ది, కథం సంపద్యతాం=ఎటు సంభవించును ?

తా. గ్రుడ్డివాఁడు చంద్రునివర్ణించుట వింతగానున్నది. (అని రాజకన్యక తలఁచెను.)

అన్ధో నాయం ధ్రువం సర్వ మేత జ్జనకైతవమ్,
వ్రతభఙ్గో యది స్యా ద్వా తం పశ్యామి మహాశయమ్. 53

టీ. అయం=ఇతఁడు, అంధః=గ్రుడ్డివాఁడు, న=కాఁడు. ధ్రువం=నిశ్చయము. ఏతత్ సర్వం=ఇదంతయు,జనకకైతవం=తండ్రి (చేసిన) కపటము. వ్రతభంగోయది=వ్రతముచెడినను, స్యాద్వా=కానీ, తంమహాశయమ్=అట్టి గొప్పవానిని, పశ్యామి=చూచెదను.

తా. ఇతఁడు గ్రుడ్డవాఁడని మాతండ్రి చెప్పినాఁడేకాని నిశ్చయముగా కాదు. నావ్రతభంగమైన నగుఁగాక. ఇంతగొప్పవానిని నేఁడు చూడక మానను.

ఉత్థాయ శయ్యాతల ఏవ తస్మి
న్నుద్గ్రీవికాధరీకృతకాణ్డవస్త్రా,
హస్తద్వయా ద్రత్నచితే గవాక్షే
రాజన్త మిన్దుం రమణీ దదర్శ. 54

టీ. రమణీ=ఆరాజకన్య,తస్మిన్ శయ్యాతలఏవ=ఆపడకమీఁద నే, ఉత్థాయ=లేచినిలిచి, ఉద్గ్రీ...వస్త్రా-ఉద్గ్రీవిక=మెడ నెత్తుటచేత, అధరీకృత = క్రిందుగాఁజేయఁబడిన, కాండవస్త్రా = తెరపట్టకలదియై, హస్తద్వయాత్=రెండుమూరలదూరమున, రత్నచితే=రత్నములుతాపిన, గవాక్షే=గవాక్షియందు, రాజంతమ్=ప్రకాశించుచున్న, ఇందుం=చంద్రుని, దదర్శ=చూచెను.

తా. ఆకన్య తెరమీఁదికిఁ దలయెత్తిచూడఁగా గవాక్షిలోఁ గూరుచుండి చంద్రునిఁ జూచుచున్నచంద్రునివంటి కవిని జూచెను.

యామినీపూర్ణతిలకా దృష్ట్వా కవి మతిస్మరమ్,
పఞ్చబాణశరాఘాతక్షతచేతా ముమోహ సా. 55

టీ. యామినీపూర్ణతిలక, అలిస్మరప్ = మన్మథునిమించిన, కవిం= కవిని, దృష్ట్వా=చూచి, పంచ...చేతాః-పంచబాణ=మన్మథునియొక్క, శర= బాణములయొక్క, ఆఘాత = దెబ్బలచేత, క్షత = కొట్టఁబడిన, చేతాః= మనస్సుగలదై, ముమోహ=మూర్ఛవోయెను.

తా. ఆచిన్నది మిక్కిలి చక్కనివాఁడైన యాకవిని జూచి యెక్కుప మక్కువగలదై మోహమును బొందెను.

తతః కవీశ్వరోఽ ద్రాక్షీత్ కాండపస్త్రోపరిస్థితం,
వక్త్రం పూర్వాచలాభ్యుద్యత్ప్రాలేయకిరణప్రభమ్. 56

టీ. తతః=పిమ్మట, కవీశ్వరః=కవీశ్వరుఁడు, ఖాండపస్త్రోపరిస్థితమ్ = తెరపట్టమీఁదనున్న, పూర్వా...ప్రభం - పూర్వాచల = ఉదయపర్వత మందు, అభ్యుద్యత్ =ఉదయించుచున్న, ప్రాలేయకిరణ=చంద్రునియొక్క, ప్రభం = కాంతివంటికాంతిగల, వక్త్రం = ముఖమును, అద్రాక్షీత్ = చూచెను.

తా. అంత నాకవీశ్వరుఁడును ఉదయించుచున్న చంద్రునివలె తెర పట్టమీఁదఁ బ్రకాశించుచున్న యాచిన్నదాని మొగమును జూచెను.

కి మిన్దుః కిం పద్మం కిము ముకురబిమ్బం కిము ముఖం
కి మబ్జే కిం మీనౌ కిము మదనబాణౌ కిము దృశౌ,
ఖగౌ వా గుచ్ఛౌ వా కనకకలశౌ వా కిము కుచౌ
తటి ద్వా తారా వా కనకలతికా వా కి మబలా 57

ముఖమునుగూర్చి చెప్పుచున్నాఁడు.—

టీ. ఇందుః కిం=చంద్రుఁడా, పద్మంకిం=పద్మమా, ముకురబింబం కిము=అద్దపుబింబా, ముఖంకిము = ముఖమా?

కన్నులను చూచి చెప్పుచున్నాఁడు.—

అబ్జేకిం=పద్మములా, మీనౌకిం=చేఁపలా, మదనబాణౌకిము=మన్మథ బాణములా, దృశౌకిము=కన్నులా?

స్తనములను చూచి చెప్పుచున్నాఁడు.—

ఖగౌవా=చక్రవాకములా, గుచ్ఛౌవా=పూలగుత్తులా, కనకకలశౌవా=బంగారుకుండలా, కిముకుచౌ=స్తనములా?

దేహమును జూచి చెప్పుచున్నాఁడు.—

తటిద్వా = మెఱుపా, తారావా = నక్షత్రమా, కనకలతికావా=బంగారుతీఁగయా, అబలాకిం=తరుణియా?

తా. సుగమము.

నేదం ముఖం మృగవిముక్తశశాఙ్కబిమ్బం
నేమా స్తనా వమృతపూరితహేమకుమ్భా,
నైవాలకావళి రియం మదనాస్త్రశాలా
నైవేద మక్షియుగళం నిగళం హి యూనామ్. 58

టీ. ఇదంముఖంన = ఇదిముఖముగాదు, మృగవిముక్తశశాంకబింబం=లేడిచేత విడిపింపఁబడిన చంద్రమండలము, ఇమాస్తనౌన = ఇవి స్తనములు కావు, అమృతపూరితహేమకుంభౌ=అమృతముచేత నిండింపఁబడిన బంగారు కుండలు, ఇయంఅలకావళి హి నైవ = ఇది ముంగురులవరుస కానేకాదు, మదనాస్త్రశాలా = మన్మథుని యస్త్రగృహము, ఇదం అక్షియుగళం నైవ=ఇది కనుగవ కానేకాదు, యూనాన్నిగళంహి=పయసువారికి సంకెలయే.

తా. సుగమము.

ధ్వాన్తానాం పటలం సుధాంశుశకలం కోదణ్డ మిన్దీవరే
పత్త్రం కోకనదస్య కమ్బులతికే కుమ్భౌ నభః సైకతే,
రమ్భే కాహళికే సరోజయుగళం సంభూయ సర్వం క్వచిత్
పఞ్చేషుం భవదగ్ధ ముజ్జ్వలయతే భావజ్ఞమై ర్విభ్రమైః. 59

టీ. ధ్వాంతానాం పటలమ్.= చీఁకటులగుంపు (కురుల మొత్త మని భావము). సుధాంశుశకలమ్=చంద్రఖండము (లలాటము), చాపౌ=రెండు ధనువులు (కనుబొమలు), తథా=ఆప్రకారము, ఇందీవరే=రెండు నల్లఁగలు

వలు (కన్నులు), కోకనదస్యపత్రం=ఎఱ్ఱదామర పువ్వురేకు (అధరము,, కంబు=శంఖము (కంఠము), లతికే=రెండుతీఁగెలు (భాహువులు), కుంభౌ= కలశములు (స్తనములు), నభః=ఆకాశము (నడుము), సైకతే=ఇసుకతిన్నెలు (పిఱుఁదులు), రంభే = అరఁటిచెట్లు (తొడలు), కాహళికే = బూరగలు (పిక్కలు), సరోజయుగళం = తామరపువ్వులజత (పాదములు), సర్వం= అంతయు, క్వచిత్=ఒకచోట, సంభూయ = కూడి, భవదగ్ధం=శివునిచేఁ గాల్పఁబడిన, పంచేషుం=మన్మథుని, భావంగమైః=మనోహరము లయిన, విభ్రమైః=విలాసములచేత, అంకురయతే=మొలపించు చున్నది.

తా. మిక్కిలి సుందరములగు చికురాదికములయిన అవయవము లన్నియు మిగుల కామోద్దీపకము లగుచున్నవని భావము.

మనో మే నాయాతం కఠినకుచయో ర్నరగతం
తదుద్ఘర్షా ద్ధ్వస్తం కి ముత విరహాగ్నౌ నిపతితమ్,
తరుణ్యా లావణ్యామృతసరసి మగ్నం కి మథవా
చర న్మార శ్చోరః కిము త దహర ద్యౌవనవనే. 60

టీ. మే=నాయొక్క, మనః = మనస్సు, కఠినకుచయోః=కఠినము లైన స్తనములయొక్క, అంతరగతం = నడిమికి పోయినది, నాయాతం= రాలేదు. తదుద్ఘర్షాత్ = ఆ స్తనముల ఒరసిడివలన, ధ్వస్తం కిం=నలిగి పోయి నదా ఏమి? ఉత=అట్లుగాక, విరహాగ్నౌ = విరహమను నిప్పునందు, నిపతి తం=పడినదా, తరుణ్యాః=చిన్నదానియొక్క, లావణ్యామృతసరసి=లావ ణ్యమనెడి యమృతపు బావియందు, మగ్నంకిం=మునిఁగినదా, అథవా= అట్లు గాకపోతే, యౌవనవనే=యౌవనమనెడియడవియందు, చరన్=తిరుగు చున్న, మారః=మన్మథుఁడనెడు, చోరః=దొంగ, తత్=దానిని, అహరత్ కిము=దొంగిలించెనా ఏమి?

తా. ఆ స్తనముల చక్కఁదనము, ఆతారుణ్యము, ఆలావణ్యముఁ జూడఁగా నామనస్సు తిరుగకున్నదని భావము.

ఆస్తాం మణ్డల మైన్దవం వరతనో ర్వక్త్రశ్రియ శ్చేత్ కథా
కోణే కుత్రచి దాసతాం కువలయా న్యక్ష్ణోః ప్రసఙ్గో యది,
దూరే తిష్ఠతు వల్లకీకలరవః ప్రస్తావనా చే ద్గిరాం
వార్తా చే దవలగ్న దేశయశసాం వ్యోమప్రభాయై నమః.

టీ. వరతనోః = సుందరాంగియొక్క, వక్త్రశ్రియః = ముఖకాంతియొక్క, కథాచేత్=ప్రస్తావ మగునేని, ఐందవం మండలమ్=చంద్ర మండలము, ఆస్తామ్ = అటుండుగాక. (ముఖకాంతి చంద్రకాంతిని మించినదని భావము.) అక్ష్ణోః=కన్నులయొక్క, ప్రసంగో యది=ప్రస్తావ మయ్యేనేని, కువలయాని=నల్లఁగలువలు, కుత్రచిత్ కోణే=ఒకమూల, ఆసతాం=ఉండుఁగాక. (నల్లఁగలువలను మించినవని భావము.) గిరాం = వాక్కులయొక్క, ప్రస్తావనాచేత్=ప్రస్తావ నగునేని, వల్లకీకలరవః=వీణయొక్క మధురనాదము, దూరేతిష్ఠతు=దూరమందుండుగాక. (పలుకులు వీణానాదమును మించినవని భావము.) అవలగ్న దేశయశసాం = మధ్యప్రదేశము (నడుము) కీర్తులయొక్క, వార్తాచేత్=ప్రస్తావమగునేని, వ్యోమప్రభాయై=ఆకాశకాంతికి, నమః=నమస్కారము (నడుము ఆకసముకన్న సూక్ష్మముగనున్నదని భావము.)

ఏవం వర్ణయతి కవౌ తద్వాక్యామృతవిబోధితా జాతా,
పశ్చాత్ తన్ముఖచన్ద్రం దృష్ట్వా లజ్జాభరాన్వితా జాతా.

టీ. కవౌ=కవి, ఏవం=ఇట్లు, వర్ణయతి=వర్ణించుచుండఁగా, తద్వాక్యామృతవిబోధితా=అతని మాటలనెడి యమృతముచేత (మూర్ఛనుండి) తేరినదిగా, జాతా=ఆయెను. పశ్చాత్=వెనుక, తన్ముఖచంద్రం = చంద్రుని వంటి యతని మోమును, దృష్ట్వా=చూచి, లజ్జాభరాన్వితా=మిగులలజ్జతోఁ గూడుకొన్నదిగా. జాతా=ఆయెను.

తా. అతని చక్కఁదనమును చూడఁగా స్మృతి తప్పెననియు, అతని వర్ణనల విని మరల స్మృతి గలిగె ననియు, మోమునుజూచి లజ్జపడె ననియు భావము.

యద్యహం సులభస్వాన్తా స్స్వయం గచ్ఛామి తం తదా,
స్వీకుర్యా ద్వా న వా తస్య మనో న జ్ఞాయతే మయా. 63

టీ. అహం=నేను, సులభస్వాంతా=చులుకని మనస్సుగలదాననై, స్వయం=స్వయముగా, తం=అతనియొద్దకు, గచ్ఛామియది = పోవుదునేని, స్వీకుర్యాద్వానవా=(నను) గ్రహించునో గ్రహింపఁడో. తస్యమనః=అతని మనస్సు, మయా=నాచేత, నజ్ఞాయతే=తెలియఁ బడకున్నది.

ఇత్థం చేతసి సంప్రధార్య వికలా సా రాజపుత్రీ కవిం
త్యక్త్వా కాణ్డపటం విహాయ పతితా శయ్యాతలే నిస్సహా,
కన్దర్పే శరసన్తతీ ర్విసృజతి ప్రాజల్ప దార్తా భృశం
రక్ష త్వం చతురాననేతి త దతః శ్రుత్వా కవీశోఽభ్యధాత్.

టీ. ఇత్థం=ఇట్లు, చేతసి = మనస్సునందు, సంప్రధార్య=తలపోసి, వికలా=వ్యాకులపడిన, సా రాజపుత్రీ=ఆయామినీపూర్ణతిలక, కవిం=కవిని, త్యక్త్వా=వదలి (కవిని జూచుటమాని), కాండపటం = తెరపట్టను, విహాయ =వదలి, నిస్సహా=తాళలేనిదై, పతితా=పడినదై, కందర్పే = మన్మథుఁడు, శరసంతతీః = బాణపరంపరను, విసృజతి = విడుచు చుండఁగా, భృశం = మిక్కిలి, ఆర్తా=పీడితురాలై, చతురానన త్వం రక్ష ఇతి=నలు మొగముల వేలుపా (చాతుర్యముగలవాఁడా బ్రహ్మఁడా అని గూఢార్థము) నీవు రక్షింపుమా అని, ప్రాజల్పత్=పలికెను. అతః=ఇందువలన, తత్=దానిని, శ్రుత్వా=విని, కవీశః = కవీశ్వరుఁడు, అభ్యధాత్=పలికెను.

ఇన్దీవరాక్షి తవ తీక్ష్ణకటాక్షబాణా
ఘాతవ్రణే ద్వితయ మౌషధ మేత దేవ,
ఏకం త్వదీయమధురాధరపాన మన్యత్
త్వత్తుఙ్గపీనకుచ కుఙ్కుమపఙ్కలేపః 65

టీ. ఇందీవరాక్షి = నల్లఁగలువలవంటి కన్నులుగలదానా! తవ=నీ యొక్క, తీక్ష్ణ...వ్రణే...తీక్ష్ణ=వాఁడియగు, కటాక్ష=కడగంటి చూపు

లనెడు, బాణ=బాణములయొక్క, ఆఘాత=దెబ్బలయొక్క, ప్రణే=గాయమునందు, ఏతద్ద్వితయమేవ = ఈరెండే, ఔషధం = మందు. (ఏదియనఁగా) ఏకం=ఒకటి, త్వదీయమధురాధరపానం-త్వదీయ=నీదైన, మధుర=తీయనైన, అధర=అధరోష్ఠముయొక్క, పానం = పానము. అన్యత్ = మఱియొకటి, త్వత్తుం...లేపః-త్వత్=నీయొక్క, పీనకుచ=బలిసిన స్తనములయందలి, కుంకుమపంక=కుంకుమకలపము యొక్క, లేపః=పూఁత.

తా. నీవలనఁ గలిగిన యీమదనబాణముల గాయములు మానుటకు లోపలికి నీయధరపానము; పైకి నీకుచములపై కుంకుమపంకలేపము. ఈరెండె యనుకూలములైన యౌషధములు.

తస్యాంగీకరణం జ్ఞాత్వా రాజపుత్త్రీ ప్రమోదతః,
ఉత్థాయ శీఘ్ర మాగత్య గాఢాలింగన మాతనోత్. 66

టీ. రాజపుత్త్రి, తస్య=అతనియొక్క, అంగీకరణం=అంగీకారమును, జ్ఞాత్వా=తెలిసికొని, ప్రమోదతః = సంతోషముతో, ఉత్థాయ = లేచి, శీఘ్రం=త్వరగా, ఆగత్య=వచ్చి, గాఢాలింగనం=బిగికౌఁగిలింతను, ఆతనోత్=చేసెను.

ప్రస్తా నీవీ న ఖలు సహసా సా స్వయం ముక్తబన్ధా
మోక్తుం నైవేచ్ఛతి కుచపటీ మాత్మనా సైవ భిన్నా,
ద్రష్టుం నైవోన్నమయతి ముఖం స్వైర ముల్లోకనం తత్
వ్రీడాం తస్యా విఫలయతి కోఽప్యేష భావానుబన్ధః. 67

టీ. నీవీ=పోఁకముడి, న ప్రస్తాఖలు = (ఆమెచేత) విప్పఁబడలేదు. సా=ఆముడి, స్వయం=తనంతనె, ముక్తబంధా=సడలింపఁబడిన ముడిగలది (ఆయెను). కుచపటీం = రవికను, మోక్తుం=వదలించుటకు, నైవేచ్ఛతి=(ఆమె) తలంపనేలేదు. సైవ=అదియె, ఆత్మనా=తనంతనె, భిన్నా=వదలినది. ద్రష్టుం=(అతనిని) చూచుటకు, ముఖం=మోమును, నైవోన్నమయతి =ఎత్తనేలేదు, తత్=ఆమోము, స్వైరం = తనంతనె, ఉల్లోకనం = పైకి

చూచునదిగా (ఆయెను). కో౽పి = ఒకానొక, భావానుబంధః=భావము యొక్క ఆవేశము, తస్యాః=ఆమెయొక్క, వ్రీడాం=సిగ్గును, విఫలయత్యేవ =వ్యర్థముగాఁ జేయుచునే యున్నది.

తా. అప్పుడామెకుం గలిగిన యగ్గలమగు భావవిశేషముచేత లజ్జ యిం చుకంతయయినను కార్యగారి గాకపోవుటచే పోఁకముడి విప్పకపోయినను తనంత నెపదలెను; అవి కెసడలెను; అతని మోమును దనివితీరఁచూడఁగలిగెను.

ఆనందాబ్ధౌ కిమపాఙ్గవీక్షణమిషా దానన్దవార్ధౌ ను సా
నర్మాలాపపదేన కిం కృతవతీ కర్ణాన్తరే గాహనమ్,
గాఢాశ్లేషమిషా దనఙ్గవివశా చిత్తం ప్రవిష్టా ను కిం
తన్వీ కింబహునారసేనమిళితాయాతా తదైకాత్మ తామ్.

టీ. తన్వీ=ఆ చిన్నది, అపాంగవీక్షణమిషాత్ = కడకంటిచూపు లనెడు వ్యాజమువలన, ఆనందవార్ధౌ=ఆనందమను సముద్రమునందు, మగ్నా ను=మునిఁగినదా యేమి? నర్మాలాపపదేన = వేడుకమాటలాడుట యను నిమిత్తముచేత, కర్ణాంతరే=చెవిలోపల, గాహనం=చేరుటను, కృతవతీ కిం=చేసినదాయేమి? గాఢాశ్లేషవశాత్ =బిగికౌఁగిలింత యను నెపముచేత, అనంగవివశా=కామముచేత పరవశయై, చిత్తం=మనసును, ప్రవిష్టాను కిం= ప్రవేశించినదాయేమి? బహునారసేన=ఎక్కువమక్కువతో, మిళితా=కూడి నదై, తదేకాత్మతాం=అతనితోనైక్యమును, యాతా కిం=పొందినదాయేమి?

ముఖరవలయజాలో మోదితాశేషగాత్రః
పులకముకుళసాన్ద్రో బోధితానఙ్గతన్త్రః,
పర మురసి నిమగ్నస్ఫారవక్షోజకుమ్భః
సుఖయతు సుముఖీనాం దోర్లతాగాఢబన్ధః. 69

టీ. ముఖర వలయజాలః=మ్రోయునట్టిగాజుల మొత్తముగలదియు, మోదితాశేషగాత్రః=సంతోషముగలిగింపఁబడిన సకల శరీరము గలదియు,

పులకముకుళసాంద్రః=మొగ్గలవంటి గగ్గురుపాటుచేత దట్టమైనదియు, బోధితానంగతంత్రః=మన్మథ ప్రచారములను దెల్పినదియు, ఉరసి=(ప్రియుని) వక్షస్సునందు, నిమగ్నస్ఫారవక్షోజకుంభః=మునిఁగినట్టి కలశములవంటి వలుఁద గుబ్బలుగలదియునైన, సుముఖీనాం = సుందరాంగులయొక్క, దోర్లతాగాఢబంధః=తీఁగెలవంటిబాహువులయొక్క బిగికౌఁగిలి, పరం=మిక్కిలి, సుఖయతు.

తా. సుగమము.

మేఘో వర్షతి మీనకేతువిశిఖా నభ్రం సముత్కంపతే
ధత్తే మౌక్తికజాల మిన్దు రయతే తారళ్య మిన్దీవరే,
శఙ్ఖ శ్చానుకరోతి హన్త శనకైః పారావతప్రక్రియాం
తారం భ్రామ్యతి చక్రవాకయుగలీ చిత్రం విధానం విధేః.

టీ. మేఘః = మేఘము (కొప్పు), మీనకేతువిశిఖాన్ = మన్మథుని బాణములను (పువ్వులను), వర్షతి=కురియుచున్నది. (అనఁగా సురతియందు కొప్పువదలి విరులు రాలుచున్నవని భావము.) అభ్రం=ఆకసము (నడుము), సముత్కంపతే=వణఁకుచున్నది. ఇందుః=చంద్రుఁడు(మోము),మౌక్తికజాలం =ముత్తెములజాలును (చెమటచుక్కలను), ధత్తే=ధరించుచున్నది. ఇందీవరే =నల్లగలువలు (కన్నులు), తారళ్యం=చపలత్వమును, అయతే = పొందుచున్నది. (ఇట వచనము విచారణీయము.) హంత=ఔరా! శంఖశ్చ=శంఖమున్ను (కంఠము), శనకైః=మెల్లఁగా, పారావతప్రక్రియాం=పావురముల రీతిని, అనుకరోతి=అనుకరించుచున్నది. (శంఖము పావురములవలె ధ్వనించుచున్నది అనిభావము.) చక్రవాకయుగళీ = జక్కవలజత (చనుగవ), తారం=హెచ్చుగా, భ్రామ్యతి = అదరుచున్నది. విధేః=బ్రహ్మయొక్క, విధానం=కార్యము, చిత్రం=వింత.

తా. మేఘము మదనబాణములఁ గురియుటను, ఆకసము వణఁకుటయు, చంద్రుఁడు ముత్తెములజాలును దాల్చుటయు, మొదలగునవి వింతలని తాత్పర్యము.

దాయాదాః శరదిన్దుకాన్తిధవళా శ్చన్ద్రం పరిష్కుర్వతే
శఙ్ఖ స్యాశయసంభవాఙ్కయుగళీ ప్రాప్నోతి సంకోచితామ్,
నృత్యన్తి ప్రతిపక్షవస్తునివహాః మాయా గృహే తేజసాం
కేశాన్తే గిరిధన్వనః శమయతే ఖేదం గభీరావటః. 71

టీ. శర...వళా-శరత్ = శరత్కాలమందలి, ఇందు = చంద్రుని యొక్క, కాంతి=వెన్నెలవలె, ధవళాః=తెల్లనైన, శంఖస్యదాయాదాః= శంఖముయొక్క పిల్లలు (ముత్తెములు), చంద్రం=చంద్రుని, పరిష్కుర్వతే= అలంకరించుచున్నవి (మోమునందు స్వేదబిందువులు శోభిలుచున్నవని భావము.) ఆశయ...గళీ-ఆశయసంభవ=మన్మథునియొక్క, అంక=చిహ్నములయొక్క, యుగళీ=జత(మత్స్యములు), సంకోచితాం=ముణుఁగుఁబాటును, ప్రాప్నోతి = పొందుచున్నది. (కన్నులు ముకుళించుచున్నవని భావము.) మాయాః=లక్ష్మియొక్క, గృహే=ఇంటియందు (పద్మమందు), తేజసాం =వెలుఁగులయొక్క, ప్రతిపక్షవస్తునివహాః = శత్రువులైన వస్తువుల సమూహములు (చీఁకటులు), నృత్యంతి=ఆడుచున్నవి. (అనఁగా కొప్పు వీడి ముఖముమీఁదఁ జెదరుచుండినదని భావము.) గిరిధన్వనః=శివునియొక్క, కేశాంతే = తలవెండ్రుకలతుదను (నడుమునందు), గభీరావటః = లోఁతుగోయి (నాభి), ఖేదం=బడలికను, శమయతే=పోఁగొట్టుచున్నది. (నడుమునందు గంభీరమైన నాభి ప్రకాశించుచున్నది).

తా. సుగమము.

ఖాన్తిపయఃపరిణామాస్త్రిదశాహారేతదీయనూతిగృహాత్,
ఉచ్ఛలతి కోఽపి నాద స్తద్గుణిని భ్రమతి గిరియుగం చిత్రమ్.

టీ. త్రిదశాహారే=దేవతల యన్నమందు (చంద్రునందు అనియర్థము. మోమునందనిభావము, చంద్రుని కళలను దేవతలు పానము చేయుదురని ప్రమాణము.) పయః పరిణామాః=ఉదక వికారములు (ముత్తెములు అనియర్థము. స్వేదబిందువులని భావము. ఉదకబిందువులే ముత్తెపుచిప్పలలోఁబడి

ముత్తెములగుసు గాన తద్వికారోక్తి.) భాంతి=ప్రకాశించుచున్నవి. (చందు)నియందు ముత్తెములు ప్రకాశించుచున్నవి యనఁగా మోమునందు స్వేదబిందువులు ప్రకాశించుచున్నవని తాత్పర్యము.) తదీయసూతిగృహాత్=ఆముత్తెములపుట్టినింటినుండి, (శంఖమునుండి యనియర్థము. కంఠమునుండి యనిభావము. శంఖమునందును ముత్తెములుపుట్టుట ప్రసిద్ధము.)కోపినాదః=ఏదోయొక శబ్దము (అనఁగా అత్యంతవిలక్షణమయినదనిభావము), ఉచ్చలతి=ఉదయించుచున్నది. కంఠమునందు మిగుల మధురమైన నాద ముదయించుచున్నదని తాత్పర్యము. తద్గుణిని=అది (శబ్దము) గుణముగా గలదానియందు (ఆకసమునందని యర్థము. నడుముకుపైనయని భావము), గిరియుగం=కొండలజత (చనుగవ), భ్రమతి = తిరుగుచున్నది, నడుముకు పైభాగమందు స్తనద్వయము చలించుచున్నదని భావము.

తా. పురుషాయితమునందు మోము చెమర్చుటయు కంఠమునందు మణితము లుదయించుటయు చనుదోయి కదలుటయు వర్ణింపఁబడినవి.

అచిరరుచా విలసన్త్యా
అమృతముచాఽభావి ఘర్మబిన్దుముచా,
పయోముచా ప్రసవముచా
విరుచా కిం చాపి తారహారముచా. 73

టీ. అచిరరుచా = మెఱపు .(దేహము), విలసంత్యా = నాట్యము చేయునదిగా, అభావి = ఆయెను. అమృతముచా=చంద్రుఁడు (మోము), ఘర్మబిందుముచా=స్వేదబిందువుల రాల్చునదిగా, అభావి. పయోముచా=మేఘము (కొప్పు), ప్రసవముచా=పూవులను రాల్చునదిగా, అభావి. కించాపి=మఱియును, విరుచా=ఆకసము (నడుము), తారహారముచా=ముత్యాల హారములను విడుచునదిగా, అభావి.

తా. పురుషాయితమునందు ప్రియురాలి దేహమాడుటయు నెమ్మోము చెమర్చుటయు కొప్పువీడి పువ్వులు రాలుటయు ముత్తెములపేరులు పెరిగి నడుముమీఁదుగ జారుటయు వర్ణింపఁబడినవి.

స్వచ్ఛాఙ్గీ నవమార్జనా దసిలతే వోల్లాసితా స్వాత్మనా
జ్యోత్స్నా పూరవిపాణ్డరామ్బరధరా రాత్రి ర్యథా శారదీ,
బిభ్రాణా కరపల్లవేన కబరీ మార్ద్రా మియం దృశ్యతే
శ్రీః శృఙ్గారసుధాపయోధిసలిలా దభ్యుత్థి తే వాపరా. 74

టీ. ఇయమ్=ఈమె, అసిలతేవ=లతవంటిదైనకత్తివలె, నవమార్జనాత్=క్రొత్తస్నానముచేత (అనఁగా అప్పుడే స్నానముచేయుటచేత నని యీమె పరమయినయర్థము. క్రొత్తఁగా చికిలిచేయుటచేత నని కత్తికి అన్వయించునట్టి యర్థము.) స్వచ్ఛాంగీ=శుద్ధమైనదేహముగలదై, స్వాత్మనా=తనస్వరూపములో, (అనఁగా అంగరాగాద్యలంకారములు లేకుండ అని యర్థము.) ఉల్లాసితా = ప్రకాశింపఁజేయఁబడినదై, (అనఁగా ఆమె అప్పుడె స్నానముచేసి పరిశుద్ధముగ నుండునపుడు చికిలిచేసిన కత్తివలె స్వభావముగ మఱింతసౌందర్యము గలిగి ప్రకాశించుచున్నదని భావము.) శారదీరాత్రి ర్యథా=శరత్కాలపురాత్రివలెను, జ్యోత్స్నా...ధరా-జ్యోత్స్నాపూర్ణ=వెన్నెలప్రవాహమువలె, విపాండర=మిక్కిలి శుభ్రమైన, అంబర=వస్త్రమును, ధరా = ధరించినదై, కరపల్లవేన = చిగురువంటిచేతిలో, ఆర్ద్రాం=తడిసిన, కబరీం=కొప్పును, బిభ్రాణా = ధరించుచున్నదై, శృంగా...లిలాత్-శృంగార = శృంగారరసమనెడు, సుధాపయోధి = అమృతసముద్రముయొక్క, సలిలాత్=జలమునుండి, అభ్యుత్థితా=ఉదయించిన, అపరా శ్రీరివ=వేరొకలక్ష్మియోయనునట్లు, దృశ్యతే=కన్పట్టుచున్నది.

తా. ఈమె ఇప్పుడే స్నానముచేసి యుండుటచేత స్వతస్సిద్ధమైన సౌందర్యాతిశయము స్ఫుటముగఁ దెలియుచున్నది. అంగరాగాదులు ఈమెకు అధికసౌందర్యాపాదకములు గావు. కావున ఇప్పుడే ఈమెచికిలిచేసిన కత్తివలె మఱింత ప్రకాశించుచు కామోద్దీపనము చేయుచున్నది. మఱియు నీమె శుభ్రవస్త్రము ధరించినదై వెన్నెలగల శరద్రాత్రివలెనున్నది. తడిసిన కొప్పును హస్తముచే పట్టుకొనియున్నది గావున శృంగారరసామృతసాగ

 

రమునుండి యుదయించిన లక్ష్మీదేవివలె నతిలోకసౌభాగ్యరమణీయ మైయున్నది.

దమ్పత్యో శ్శయనస్థయోః ప్రణయతో
జాతే మహావిగ్రహే
వైముఖ్యం సమభూత్ తదైవ మదనా
వస్థాక్షమే యోజితే,
భోః దూతీవిరహో బలీ భవతి సా
శయ్యాఽపి న స్పన్దతే
తత్రాఽఽచ్ఛాదన మేవ తావ దుభయోః
స్నేహం వ్యధాత్ పుణ్యతః. 75

టీ. శయనస్థయోః=పానుపునందుఉండిన; దంపత్యోః = భార్యాభర్తలకు, ప్రణయతః=ప్రేమనుబట్టి. (అనురాగమును బరీక్షించుటకనుట.) మహావిగ్రహేజాతే = గొప్పకలహము కలుగఁగా, వైముఖ్యం = పెడమొగము గలిగియుండుట, సమభూత్ = సంభవించెను. (అనఁగా పొలయల్కచే పెడమొగముఁబెట్టి పరుండి రని భావము.) తదైవ=అప్పుడె, మదనావస్థాక్షమే=జాగరణము (నిద్రపట్టకుండుట) మొదలైన కామావస్థలును వానిని తాళఁజాలకుండుటయును, యోజితే=కూర్పఁబడినవి, (ఇరువురును పొలయల్కచే వెనుకకుమరలిరిగాని నిద్రపట్టక కొంచెము బిగుతనముచే ఒండొరులను చూడక అట్లుండుటకు తాళలేక సంకటపడుచుండఁగా), భోః=అయ్యోపాపము (అసమయములో), దూతీవిరహః=దూతిక లేకుండుట, బలీ=బలవంతమైనది (కష్టతరమైనదిగా), భవతి = అగుచున్నది. (దూతికయుండినయెడల వారిబెట్టు తగ్గనీక అలుకమాన్పి సమరసపుచ్చి సంధిచేసి కామతంత్రము నెరవేర్పునుగదా అది లేనందున నిట్లుండవలసివచ్చినదిగదా అని భావము). సా శయ్యాపి=ఆపాన్పును, నస్పందతే=కదలకున్నది (ఆపానుపైనను కదిలె నేనియది సాకుగా కొంచెము సంసర్గము కలుగును, వీరు కదలకుండుటచేత అది

యును కదలలేదు పాపము,) తత్ర తావత్ =అట్టిస్థితిలో, ఉభయోః=ఇరువురి యొక్క, పుణ్యతః=సుకృతమువలన, ఆచ్ఛాదనమేవ=కప్పుకొను దుప్పటి యె, స్నేహంవ్యధాత్ =(ఇరువురి సుకృతమనుటచేత స్నేహమును గూర్చెను. కలియకుండుటకు ఇరువురును తాళఁజాలనివారేయని భావము. కప్పుకొనుటకు దుప్పటిని పైకి లాగుకొనుట యనుసాకున నొండొరులు తాఁకుటలో నత్యంత సుఖమైనస్పర్శ గలిగి యలుకలు మాని కలిసికొనిరి.)

ఉగ్రగ్రాహ ముదన్వతో జల మతి
క్రామ త్యనాలమ్బనే
వ్యోమ్ని భ్రామ్యతి దుర్గమక్షితిభృతాం
మూర్ధాన మారోహతి,
వ్యాప్తం యాతి ఫణాకరై రహివరైః
పాతాళ మేకాకినీ
కీర్తి స్తే మదనాభిరామనృపతే
మధ్యేసభం యోషితామ్. 76

టీ. కవి చెప్పుచున్నాఁడు:— మదనాభిరామనృపతే = మదనాభి రామరాజా! తేకీర్తిః = నీయశస్సు, యోషితాం = స్త్రీలయొక్క, మధ్యే సభం=సమూహమధ్యమునందు, ఏకాకినీ=ఒంటరిదే, ఉగ్రగ్రాహం=భయం కర మైనజలజంతువులుగల, ఉదన్వతః జలం=సముద్రముయొక్కజలమును,అతి క్రామతి=దాఁటుచున్నది. అనాలంబనే = పట్టుదలలేని, వ్యోమ్ని=ఆకాశము నందు, భ్రామ్యతి=తిరుగుచున్నది. దుర్గమక్షితిభృతాం = ఎక్కుటకు శక్యము గాని కొండలయొక్క, మూర్ధానం = తలను, ఆరోహతి = ఎక్కుచున్నది. ఫణాకరైః=పడగలనువిప్పునట్టి, అహివరైః = సర్పశ్రేష్ఠములచేత, వ్యాప్తం= వ్యాపింపఁబడిన, పాతాళం = పాతాళలోకమునుగూర్చి, యాతి = పోవుచున్నది.

తా. మదనాభిరామరాజా! సముద్రములలోని ద్వీపాంతరములనుండువారు ఆకాశమున సంచరించుదేవతలును పాతాళమందలి నాగులును పర్వతనివాసులైన యారణ్యకులును ఇటు ముల్లోకములయందలివారును నీ కీర్తిని బొగడుచున్నారు. అనఁగా కీర్తియనుమిషచే ప్రస్తుతనాయికను వర్ణించుచున్నాఁడు:-రాజా! నీకుమారితవంటి స్త్రీ త్రిలోకములయందు ప్రశంసింపఁబడుచున్నదని భావము. ఇట నీశ్లోకము 'మదన అభిరామ నృపతే' అని పదవిభాగముచేసిన మన్మథపరమైన యర్థమగుచున్నది. మన్మథా! అందగాఁడా! రాజా! నీదెబ్బకు లోపడనివారు ఏలోకమునందును ఏప్రాణియు లేరుగదా! (కావున నేనెంత వివేకము గలవాఁడయినను నీవలను దప్పించుకొనలేక పోయితిని అనిభావము.) నాయికయొక్క సౌందర్యాదిగుణవిషయాతిశయము సర్వలోకకమనీయ మని తాత్పర్యము.

సుభ్రు త్వం కుపితే త్యపాస్త మశనం
త్యక్తా కథా యోషితాం
దూరా దేవ వివర్జితాః సురభయః
స్రగ్గన్ధధూపాదయః,
కోపం రాగిణి ముఞ్చ మ య్యవనతే
దృష్టే ప్రసీ దాధునా
సత్యం త్వద్విరహా ద్భవన్తి దయితే
సర్వా మ మాన్ధా దిశః. 77

టీ. సుభ్రు=అందములైన కనుబొమలు కలదానా, త్వం=నీవు, కుపితేతి=కోపించితివని, అశనం = అన్నము, అపాస్తం=త్రోయఁబడినది. యోషితాం=స్త్రీలయొక్క, కథా=కథ, త్యక్తా=విడువఁబడినది. స్రగ్గంధధూపాదయః= పుష్పములు సువాసనద్రవ్యములు ధూపములు మొదలైన, సురభయః = సువాసనలు, దూరాదేవ = దూరముగానే, వివర్జితాః = విడువఁబడినవి.

రాగిణి=అనురాగముగలదానా, కోపం=కోపమును, ముంచ=విడువుము. అవనతేమయి = ప్రణతుఁడైననేను, దృష్టే = చూడఁబడఁగా (ప్రణతుఁడనగు నన్నుఁజూచి), అధునా=ఇప్పుడు, ప్రసీద = అనుగ్రహింపుము (ఇంతట నైనను నన్ననుగ్రహింపుము), సత్యం = సత్యముగా, త్వద్విరహాత్ = నిన్నెడఁబాయుటవలన, దయితే = ప్రియురాలా! సర్వా దిశః = దిక్కులన్నియుం, మమ=నాకు, అంధాః=గ్రుడ్డివిగా, భవంతి=అగుచున్నవి.

తా. ప్రియురాలా! నీకనుబొమలయందము నేమనిచెప్పను. కోపగించినప్పుడు మిగుల వక్రములై మిక్కిలి యుద్దీపకములై అన్నాదులయందు నిచ్చలేకుండఁ జేయుచున్నవి. మఱియే స్త్రీతోనైనముచ్చటించిన నీమనంబున కేమి తోఁచునో యని యదియును మానుకొంటిని. నీప్రసాదసుఖ మున్నప్పుడనుకూలములైన పుష్పగంధాదులు ఇప్పుడు పనికిరాకపోయినవి. నీవునాయం దెంతోయనురాగము గలదానవు. ఇపుడేల కోపముచేయుచున్నావు. తాళఁజాలను. నీకు నమస్కరించుచున్నాను. నన్నుఁజూడుము. నీయనుగ్రహములేనియెడ నా కేదిక్కును తోఁచకున్నది. ఇది ముమ్మాటికి సత్యమని నమ్ముము.

ఇట నేత్రపరమైనయప్రకృతార్థము స్ఫురించుచున్నది. ఎట్లనఁగా— సుభ్రు=మంచికనుబొమలుగల, రాగిణి=ఎఱ్ఱనైన, దృష్టే=నేత్రమా! త్వంకుపితేలి=నీవు కలఁతపడితివి గావున, అశనంఅపాస్తం=అన్నము మానుకొనఁబడినది (నొప్పిచేత నన్నముసహింపలేదు). యోషితాం కథాత్యక్తా=(అపథ్యము గావున) స్త్రీలప్రస్తావము మానుకొనఁబడినది. స్రగ్గంధధూపాదయః దూరాదేవవివర్జితాః=పుష్పాది పరిమళవస్తువులు (అపథ్యములు గావునను మనస్స్వస్థ్యము లేకపోవుటచేతను) దూరముగానే త్రోయఁబడినవి. కోపంముంచ = కలఁతనువిడువుము.అవనతేమయి ప్రసీద=వెలుతురు చూడలేక తలవంచుకొని పోవుచున్న నన్నుఁజూడుము. అధునా = ఇప్పుడు నీవులేనియెడ నాకు ఏదిక్కును కనఁబడలేదు. (నేత్రమునకు కలఁత వచ్చినప్పుడు నొప్పిచేత కంటెనిగూర్చి తలంచుకొన్నమాటలు అప్రకృతములై ప్రకృతార్థమును పరిష్కరింపుచు శ్లాఘ్యతమము లగుచున్నవి.)

నానారాజకుమారకాన్ గుణవతః
సంభావ్య మన్మన్దిరే
కాలే భవ్యతరే స్వయంవరవిధౌ
చిత్తాపహర్త్రే ముదా,
దత్త్వా త్వాం సుకృతీ భవేయ మితి మ
య్యాలోచనాతత్పరే
త్వం మద్వంశకళఙ్క మఙ్కురయసే
కిం వా కరో మ్యాత్మజే. 78

అవ. ఇట్లు వీరిసంసర్గమును చేటికలవలనం దెలిసికొని రాజు కొమారి తను అడుగుచున్నాఁడు.—

టీ. ఆత్మజే=పుత్రీ! (నాకూఁతురవై పుట్టి యిట్టినింద నాకుం గలుగఁజేసితివిగదా యని భావము.) గుణవతః=సౌందర్యశౌర్యాదిగుణశాలులగు, నానారాజకుమారకాన్ = అనేకులయిన రాజకుమారులను, మన్మందిరే = నాయింట, సంభావ్య=సత్కరించి, భవ్యతరేకాలే = మంచిసమయమందు, స్వయంవరవిధౌ=స్వయంవరవిధియందు, చిత్తాపహర్త్రే = (వారిలో) మనోహరుఁడగు వానికి, ముదా=సంతోషముతో, త్వాం=నిన్ను,దత్త్వా = ఇచ్చి, సుకృతీభవేయమితి=ధన్యుఁడ నయ్యెదనని, మయిఆలోచనాతత్పరే = నేను ఆలోచనయందు ఆసక్తుఁడ నగుచుండఁగా (ఆసక్తిగల్గి ఆలోచించుచుండఁగా), త్వం = నీవు, మద్వంశకళంకం = (ఎన్నఁడులేని) నావంశమునకు నిందను, అంకురయసే = మొలిపించుచున్నావు. కింవాకరోమి = ఏమి చేయుదును ?

తా. పుత్రీ! యోగ్యులయిన రాజకుమారులను బిలిపించి స్వయంవరమున నీకిష్టమైనవానికి నిన్నిచ్చి వివాహముచేసి ధన్యుఁడను కావలయు నని నేనెంతో అపేక్షపడుచుండఁగా నీవు నావంశమునకు నింద తెచ్చిపెట్టి నన్ను చెఱుచుచున్నావు. ఏమి సేతును? నిన్ను దండింపలేక యూరకున్నాను.

ఇ త్యుక్తా జనకేన ధీరవచనా
సా ప్రత్యువా చేతి తం
స్వామి౯ సర్వ మిదం త్వ య్యైవ రచితం
-- త్వద్వ్యాజ ఏవం తవ,
చి త్తక్లేశకరో హ్యభూ న్మమ పున
ర్జాతం శుభం యత్ త్వయా
బద్ధః కాణ్డపటో ద్రుతం సమభవత్
పాణిగ్రహ శ్చావయోః. 79

టీ. జనకేన = తండ్రిచేత, ఇతి = ఇట్లు, ఉక్తా = చెప్పఁబడినదై, ధీరవచనా = దిట్టరిమాటలుగలదైన, సా = ఆరాజకన్య, తం = ఆరాజును గూర్చి, ఇతి = ఇట్లు, ప్రత్యువాచ = బదులుచెప్పెను. స్వామి౯ = రాజా!, ఇదం సర్వం = ఇదియంతయు, త్వయైవ = నీచేతనే, రచితం = చేయఁబడినది. త్వద్వ్యాజః = నీకపటము, తవ = నీకు, ఏవం = ఇట్లు, చిత్తక్లేశకరః = మనసునకుఁ గష్టమును చేయునదిగా, అభూత్ కిల హి = ఆయెనుగదా? మమపునః = నాకైననో, శుభంజాతం = కల్యాణమయినది. యత్ = ఎట్లనఁగా, త్వయా = నీచేత, కాండపటః = తెరపట్ట, బద్ధః = కట్టఁబడెను. ఆవయోః = మాకిద్దఱికిని, పాణిగ్రహః = వివాహము, ద్రుతం = శీఘ్రముగా, సమభవత్ =ఆయెను.

తా. పూర్వశ్లోకమునందుఁ జెప్పినట్లు రాజడుగగా కౌమార్తె ధైర్యముతో నిట్లనియె. రాజా! నీవు కపటముతో చేసినకార్యము నీకే మనస్తాపము గలిగించినది. నాకుమాత్రము కల్యాణమె యయినది. యెట్లనఁగా పెండ్లియందు వధూవరుల నడుమ గట్టినట్లు మాయిద్దఱినడుమ తెరఁగట్టించితివి గావున మాకు పెండ్లి జరుగనే జరిగినది.

శ్రుత్వా తస్యా స్తదుక్తిం నరపతి రవదత్
పుత్రికే తావకీనం
సర్వం త ద్దుశ్చరిత్రం సకరుణహృదయః
సంసహే మత్సు తేతి,
త్వం చ త్యక్త్వా కుబుద్ధిం భవ శివహృదయా
త్వాం ప్రదాస్యామి శీఘ్రం
సద్వంశ్యా యైవ భూపాలకతనయవరా
యేతి సాఽప్యాహ భూయః. 80

టీ. నరపతిః=రాజు, తస్యాః=ఆచిన్నదానియొక్క, తదుక్తిం=ఆమాటను, శ్రుత్వా=విని, అవదత్=పలికెను. పుత్రికే = కూఁతురా!, తావకీనం=నీదైన, సర్వం=సమస్తమైన, తద్దుశ్చరిత్రం=ఆదురాచారమునంతయు, మత్సుతేతి=నాబిడ్డయని, సకరుణహృదయః = దయతోఁగూడినమనస్సుగలవాఁడనై, సంసహే=ఓర్చుచున్నాను. త్వంచ=నీవును, కుబుద్ధిం = దుర్బుద్ధిని, త్యక్త్వా=విడిచి, శివహృదయా = మంచిమనస్సుగలదానవుగా, భవ = కమ్ము. త్వాం=నిన్ను, శీఘ్రం = శీఘ్రముగా, సద్వంశ్యాయ = మంచివంశమందుఁబుట్టిన, భూపాలకతనయవరాయైవ=మంచి రాజపుత్రునకే, ప్రదాస్యామి=ఇచ్చెదను. ఇతి=ఇట్లనెను. సాఽపి=ఆచిన్నదియు, భూయః=మరల, ఆహ=పలికెను.

తా. పైనఁజెప్పిన మాటలు విని రాజు కూఁతురి కిట్లనియె. పుత్రీ! నీవు బిడ్డవుగాన దయతో మన్నించితి. ఇఁకనైన దుష్టకార్యము చేయకుము. నిన్ను మంచిరాకొమారుని కిచ్చి పెండ్లిచేసెదను అనఁగా తండ్రికి కూఁతు రిట్లనియె.

దేవ త్వం శృణు చిత్త నేత్ర రసనా
ఘ్రాణ శ్రుతి స్పర్శనా

న్యాసన్ తద్వశవర్తితాని నితరా
మేవం మదీయాని వై,
కస్మై యచ్ఛసి చేతనావిరహితం
కాయం మదీయం వదే
త్యాకర్ణ్యాతిరుషా తతో నరపతి
ర్వేగా దపాగాత్ సభామ్. 81

టీ. దేవ=రాజా! త్వం=నీవు, శ్రుణు-వినుము. మదీయాని చిత్తనేత్రరసనాఘ్రాణ శ్రుతిస్పర్శనాని=నావియగు మనసు, కన్నులు, నాలుక, ఘ్రాణేంద్రియము, వినికి, తాఁకుట, నితరాం=మిక్కిలి, ఏవం=ఇట్లు,తద్వశవర్తితాని=ఆతని స్వాధీనముగా నుండినవి, ఆసన్ = ఆయెను. చేతనావిరహితం=ప్రాణములేని, మదీయం కాయం=నాదుదేహమును, కస్మై=ఎవ్వనికి, ప్రయచ్ఛసి = ఇచ్చెదవో, వదేతి=చెప్పుమనెను. ఆకర్ణ్య=విని, నరపతిః=రాజు, అతిరుషా=మిగుల కోపముతో, తతః=అక్కడనుండి, సభాం=సభకు, వేగాత్=వడిగా, అపాగాత్ = లేచిపోయెను.

తా. రాజా! నాయింద్రియములన్నియు నతనియందే యధీనముగా నుంచఁబడియున్నవి. కేవలదేహమును ఎవ్వరి కిచ్చెదవో చెప్పుము. (అనఁగా నాకతఁడు తప్పమఱియొకఁడు ప్రియుఁడుగాడు). అనిచెప్పఁగా రాజునకుఁ గోపమువచ్చి యక్కడినుండలేచి త్వరగా సభకుఁబోయెను. (కవిని దండించుట కని సూచన.)

స్థిత్వాఽఽసనే భూపతి రి త్యువాచ
స కోటిపాలం ప్రతి బిల్హణం కవిమ్,
బద్ధ్వా శిర శ్ఛేదయ శీఘ్ర మస్య
త్వం గచ్ఛ గచ్ఛే త్యవదత్ త్రివారమ్. 82

టీ. సభాపతిః=ఆరాజు, ఆసనే=సింహాసనమందు, స్థిత్వా=కూరుచుండి, కోటిపాలం ప్రతి=కోటిపాలుఁడను పేరుగల కొత్త్వాలుతో, బిల్హణకవిం=బిల్హణకవిని, బద్ధ్వా=కట్టి, అస్య=ఇతనియొక్క, శిరః=తలను, శీఘ్రం=త్వరగా, ఛేదయ=నఱుకుము. త్వం=నీవు, గచ్ఛగచ్ఛేతి=పోపొమ్మని, త్రివారం=ముమ్మారు, అవదత్=పలికెను.

తా. రాజు సభకుపోవఁగానె కోటిపాలుఁడను పేరుగల కొత్త్వాలును బిలిచి బిల్హణకవి తలను శీఘ్రముగానఱుకుము. త్వరగా పోపొమ్మని ముమ్మారు చెప్పెను.

కోపేన శాసితుం శక్తో యః ప్రసాదేన రక్షితుమ్,
స ఏవ రాజా లోకస్య నేతరో జాతకిల్బిషః. 83

టీ. కోటిపాలుఁ డనుచున్నాఁడు.—యః=ఎవఁడు, కోపేన=కోపముచేత, రక్షితుం=కాపాడుటకు, శక్తః=సమర్థుఁడో, ప్రసాదేన=అనుగ్రహముచేత, రక్షితుం=కాపాడుటకు, శక్తః=సమర్థుఁడో, సఏవ=వాఁడె, లోకస్య=లోకమునకు, రాజా=రాజు. జాతకిల్బిషః=పాపముగల, ఇతరః = మఱియొకఁడు, న=కాఁడు.

తా. కోపముచేసి దండింపఁ గలవాఁడు అనుగ్రహించి రక్షింపఁగల వాఁడు ఎవఁడో వాఁడె రాజు. ఇతరుఁడు పాపాత్ముఁడు.

సాధు దేవ త్వయాఽఽజ్ఞప్తం తత్సమస్తం కరోమ్యహమ్,
తథాఽపి స్వామినా కార్యా యోగ్యాయోగ్యవిచారణా.

టీ. దేవ=రాజా!, త్వయా = నీచేత, ఆజ్ఞప్తం=ఆనతీయఁబడినది, సాధు=మంచిది, తత్ = అందువలన, సమస్తం=అంతయును, అహం = నేను, కరోమి=చేయుచున్నాను. తథాఽపి=అట్లైనను, స్వామినా=రాజుచేత, యోగ్యాయోగ్యవిచారణా = యుక్తమా అయుక్తమా అను విచారము, కార్యా= చేయఁదగినది.

తా. రాజా ! నీవుచెప్పినట్లుగా నేను చేయక తప్పదు గనుక చేసె దనుగాని నీవు యుక్తాయుక్తములు విచారింపక యిట్లు సాహసపడుట మంచి పనికాదని యెంచెదను.

ఇతీరితః కోటిపాలం విద్రావ్య ప్రాహిణోన్నృపః,
స బిల్హణకవిం బద్ధ్వా శ్మశానం ప్రయయౌ తతః. 85

టీ. ఇతి=ఇటు, ఈరితః=(కోటిపాలునిచేత) చెప్పఁబడిన, నృపః =రాజు, కోటిపాలం = కోటిపాలుని, విద్రావ్యప్రాహిణోత్ = తరిమిపం పెను. సః=అతఁడు (కోటిపాలుఁడు), బిల్హణకవిం=బిల్హణకవిని, బద్ధ్వా= కట్టి, తతః శ్మశానం ప్రయయౌ = తరువాత శ్మశానమునకుఁ బోయెను.

తా. రాజు కోటిపాలుని మాటలను సరకుసేయక శీఘ్రముగా బిల్హ ణుని వధించిరమ్మని తరిమెను. అతఁడు రాజు నుత్తరువుమేరకు కవిని బంధించి శ్మశానమునకుఁ గొంపోయెను.

అయి కిమనిశం బాలే ద్వారే సమున్నతకన్ధరా
కువలయదళస్నిగ్ధే ముగ్ధే విముఞ్చసి లోచనే,
అమరరమణీలీలావల్గద్విలోకనవాగురా-
వలయపతితో న వ్యావృత్తిం క్వ యాస్యతి బిల్హణః. 86

టీ. అయిముగ్ధబాలే=ఓసి తెలియనిచిన్నదానా!, సమున్నతకంధరా =ఎత్తినమెడగలదానవై, కువలయదళస్నిగ్ధే=కలువరేకులవలె నిగ్గుగలవైన, లోచనే=కన్నులను, ద్వారే=వాకిటియందు, అనిశం=ఎల్లపుడు, కిం విముంచసి =ఏలప్రసరింప(నిగిడింపఁ) జేయుచున్నావు?.(ద్వారమునను౦డిచూచుచున్నా వేమి యని యర్థము.) ఏలన, బిల్హణః=బిల్హణకవి (నేను) అమర...తితః- అమరరమణీ=దేవతాస్త్రీలయొక్క, లీలా=విలాసముచే, వల్గత్ =చలించుచున్న, విలోకనవాగురావలయ=చూపులను గుండ్రనివలయందు, పతితః=పడినవాఁడై, క్వ=యెక్కడ, వ్యావృత్తిం=మరలివచ్చుటను, యాస్యతి=పొందును? (చావు నకు సిద్ధమైననాపై మరల వచ్చునేమో యను ఆశ వదలు మని భావము.)

గత్వా శ్మశాన మథ బిల్హణపణ్డి తోఽపి
త త్రోపవిశ్య సకలా శ్చ దిశో విలోక్య,
మన్దస్మితో నృపతిపూరుష మాహ సాసిం
ఛింధ్యాశు భద్ర మమ మ_స్తక మి త్యుదారమ్. 87

టీ. అథ=పిమ్మట, బిల్హణపండితోఽపి-బిల్హణ=బిల్హణుఁడనెడు, పండితోఽపి=పండితుఁడును, శ్మశానం = శ్మశానమును, గత్వా=పొంది, తత్ర= అచ్చట, ఉపవిశ్య=కూరుచుండి, సకలాః = సమస్తమగు, దిశోఽపి=దిక్కుల నున్ను, విలోక్య=చూచి, మన్దస్మితః=చిఱునగవుగలవాఁడై. భద్ర=ఓభద్రుఁడా! మమ=నాయొక్క, మస్తకం=శిరసును, ఆశు=శీఘ్రముగ, ఛింధి=నఱకుము. ఇతి=ఇట్లు, ఉదారం=ఉదారముగ, సాసిం=కత్తితోఁగూడనుండు, నృపతి పూరుషం=రాజనియుక్తపురుషునిగూర్చి, ఆహ=చెప్పెను.

తా. ఇట్లాజ్ఞాపింపఁబడిన యనంతర మా బిల్హణకవివరేణ్యుఁడు వధ్య స్థానమగు శ్మశానంబునకరిగి యచ్చట నుపవిష్టుఁడై దిక్కులఁ గలయంజూచి తనవధకు నియుక్తుఁడై కత్తిని చేతధరించి యుండు పురుషునిం గని చిఱునగవుతోఁ గూడినవాఁడై సౌమ్యుడా! శీఘ్రము నాతలం దెగవ్రేయు మని యుదారతఁ జెలంగ పలికెను.

కిం కారణం కవివరేణ్య దరస్మితోఽసి
భీతి ర్న కిం తవ భవిష్యతి భీః కథం వా,
ఉత్ఫుల్లలోచనలసద్వదనారవిన్దా
దేవీ యదీయహృదయే నివస త్యజస్రమ్. 88

టీ. కవివరేణ్య = కవిశ్రేష్ఠుఁడా!, దరస్మితః=చిఱునగవు గలవాఁడవై, అసి = అగుచున్నావు. కారణం = కారణము, కిం=ఏమి?, తవ=నీకు, భీతిః=భయము, నకిమ్=లేదా ? యదీయ హృదయే - యదీయ=ఎవనిసంబంధమగు, హృదయే=హృదయమున, ఉత్ఫుల్ల...అరవిన్దా - ఉత్ఫుల్ల=

వికసించిన,లోచన=నేత్రములచే, లసత్=ప్రకాశించుచుండు, వదనారవిన్దా=ముఖకమలముగలిగియుండు, దేవీ=దేవి, అజస్రం=ఎల్లప్రుడును, నివసతి=నివసించునో,తస్య=వానికి, కథంవా=ఎట్లు, భీః=భయము,భవిష్యతి=కలుఁగును?.

తా. ఓకవిశిఖామణీ! వధాదండము విధింపఁబడి వధ్యస్థానంబునకుఁ గొనిరాఁబడియుండు నీమనసును భయంబు కలంచుచుండలేదా? నవ్వెడ వేల? యని యారాజనియుక్తుం డడుగుటయు కవివరేణ్యుం డిట్లు చెప్పందొడంగె. సుందరములగు నేత్రంబులు వికసించియుండ నొప్పుచుండు నా సుందరీమణి యగు దేవి సంతతధ్యానవశంబున నాహృదయంబున నివసించియుండ మనంబు తదేకాయత్తం బగుటచే నన్యవిషయంబుల గ్రహింపకుండు నపుడు నాకు భయాదులు కలుగుట కవకాశ మెక్కడిది?

తాం దేవతాం స్మరవిసృత్వరచారుశోభాం
గణ్డస్థలద్వితయరాజితపత్త్రవల్లీమ్,
ఉత్తుఙ్గపీనకఠిన స్తనమధ్యసంస్థ
హారావళీం గుణవతీం సతతం స్మరామి. 89

టీ. స్మర...భాం-స్మర = మన్మథునిచేత (కామాతిశయముచేత), విసృత్వరచారుశోభాం=అందమయిన కాంతిగలదియు, గండ...ల్లీం-గండస్థలీ ద్వితయ=చెక్కిళ్ల ప్రదేశముల రెండిఁటియందును, రాజితపత్రవల్లీం=మకరికాది పత్రములు గలదియు, ఉత్తుం...ళీం-ఉత్తుంగ=మిక్కిలి యెత్తైనవియు, పీన=వలుదలైనవియు, కఠిన=గట్టివియునగు, స్తన=చన్నులయొక్క, మధ్య=నడుమ, సంస్థ=ఉండిన, హారావళీం = ముత్తెములపేరులమొత్తము గలదియును, గుణవతీం=సౌభాగ్యాది గుణములు గలదియును, తాం దేవతాం =ఆదేవతను (నాపాలిటి కోరికలనిచ్చునట్టి భాగ్యదేవతవలె నుండు యామినీపూర్ణతిలకను), సతతం=ఎల్లప్పుడు, స్మరామి=తలంచుచున్నాను.

తా. నాపై మిగుల వలపు గలిగి లావణ్యకాంతి పరిపూర్ణ సర్వావయవాంగియై నా కన్నులపండువుసేయుచు నామనోరథంబుల సఫలంబుల

గావించు నాచిన్నారి యన్నువ నా మనోరథమంగళదేవత నామనంబున నెలకొని న న్నానందసుధాంబుధి నోలలాడించు చుండుటంజేసి నా కించు కైనను వెరపు గలుగదని భావము.

అద్యాపి తాం కనకచమ్పకదామగౌరీం
ఫుల్లారవిన్దనయనాం తనురోమరాజిమ్,
సుప్తోత్థితాం సురతవిహ్వలసాలసాఙ్గీం
విద్యాం ప్రమాదగళితా మివ చిన్తయామి. 90

టీ. కనక...గౌరీ-కనక=బంగరువలెను, చంపక=సంపెఁగయొక్క, దామ = మాలికవలెను, గౌరీం = గౌరవర్ణము కలిగినదియు, ఫుల్లా... నయనాం-ఫుల్ల=వికసించిన, అరవిన్ద=తామరపూవులవంటి, నయనాం=నేత్రములు గలిగినదియు, తను...రాజిం-తను=సూక్ష్మమగు, రోమ=నూఁగారు (వెంటు)కలయొక్క, రాజిం=పంక్తిగలిగినదియు, సుప్తోత్థితాం-సుప్త=నిదురించి, ఉత్థితాం = మేల్కొనినదియు, సురత...సాంగీం-సురత=క్రీడచే, విహ్వల=వశముగానిదియు, సాలస=అలసటతోఁగూడినదియు(నగు), అంగీం=అవయవములు కలిగినదియు (నగు), తాం = ఆ యామినీపూర్ణతిలకను, ప్రమాదగళితాం-ప్రమాద=పొరబాటువలన, గళితాం=విడువఁబడిన, విద్యామివ=విద్యనువలె, అద్యాపి=ఇప్పటికిని, చిన్తయామి=తలఁచుచున్నాను.

తా. అతిమనోహరమగు శరీరము యొక్కయు అవయవములయొక్కయు సన్నివేశమును సౌందర్యమును కలిగియుండు నాచెలువయొక్క నిద్దురనుండిలేచినకాలమున వివశమై అలసియుండెడి స్థితివిశేషము అభ్యాసవిశేషముచే రసానుభవానందము కలిగియుండువిద్య మఱవఁబడినప్పటిస్థితి వలె నిప్పటికిని చింతను గలుగఁ జేయుచున్నది.

అద్యాపి త ద్వికసితామ్బుజమధ్యగౌరం
గోరోచనాతిలకపాటలఫాలదేశమ్,

ఈషన్మదాలసవిఘూర్ణితదృష్టిపాతం
కాన్తాముఖం ప్రతి మనో మమ సన్నిధత్తామ్. 91

టీ. వికసి...గౌరం-వికసిత = విచ్చిన, అంబుజ = తామరపూవు యొక్క, మధ్య=లోపలిభాగమువలె, గౌరం=పచ్చని వర్ణము గలిగినదియు, గోరోచ... దేశం-గోరోచనా=గోరోచనముచే నిర్మితమైన, తిలక = తిలకముచే, పాటల=పాటలకాంతిగల, ఫాలదేశం=లలాటభాగము కలిగినదియు, ఈష...పాతం-ఈషత్ = అల్పమైన, మద=మదముచే, అలస=మందమైనట్టియు, ఘూర్ణిత=సుడివడుచున్న, దృష్టి=చూపులయొక్క, పాతం=ప్రసారముగలిగినదియు (నగు), కాంతాముఖం ప్రతి-కాంతా=ప్రియురాలియొక్క, ముఖం ప్రతి=ముఖమునుగూర్చి, అద్యాపి=ఇప్పటికిని, మమ=నాయొక్క, మనః=మనస్సు, సన్నిధత్తాం=సమీపించును గాక.

తా. పద్మమధ్యమువంటి వర్ణశోభగల ముఖమున పాటలవర్ణము గల గోరోచనతిలక ముంచఁబడుటచే నతిమనోహరమై మదముచే మంథరమును భ్రమితమునునగు దృష్టిప్రసారముగల యాసుందరీమణియొక్క ముఖమున సీఘోరావస్థాకాలమునను నామనస్సు ప్రసరించుచుండుఁగాక.

అద్యాపి తత్ కనకకుణ్డలఘృష్టగణ్డ
మాస్యం స్మరామి విపరీతరతాభియోగే,
ఆన్దోళనశ్రమజలస్ఫుటసాన్ద్రబిన్దు
ముక్తాఫలప్రకరవిస్ఫురితం ప్రియాయాః. 92

టీ. విపరీత...యోగే-విపరీతరత=పుంభావకేళియొక్క, అభియోగే =గాఢప్రవేశమునందు, కనక...గండం-కనకకుండలం = బంగరు కుండలములచేత, ఘృష్ట=రాచుకొనఁబడిన, గండం=గండభాగములు గలిగినదియు, ఆందోళన...విస్ఫురితం-ఆందోళన = పెనఁగుటచేఁగలుగు, శ్రమజల=చెమ్మటయొక్క, స్ఫుట = స్పష్టములైనట్టియు, సాంద్ర = దట్టములైనట్టియు, బిందు=బిందువు లనెడు, ముక్తాఫల=ముత్తియములయొక్క, ప్రకర=సమూ

హముచే, విస్ఫురితం=ప్రకాశించునదియు (నగు), ప్రియాయాః=ప్రియురాలి యొక్క, తత్=అట్టి, ఆస్యం=ముఖమును, అద్యాపి=ఇప్పటికిని, స్మరామి= తలఁచుచున్నాను.

తా. పుంభావకేళీకాలంబున కేళియందలి రభసతచే గలిగినచెమట చుక్కలు ముత్యములవలె నలరారుచుండ బంగరుకర్ణభూషణములు కదలుచు గండములయందు రాచుకొనుచుండుటచే మెఱయుచుండు ప్రియురాలి యొక్క యప్పటిముఖము నాకిప్పటికిని స్మృతికి వచ్చుచున్నది.

అద్యాపి తాం శశిముఖీం నవయౌవనాఢ్యాం
పీనస్తనీం ఘనకచా మతిగౌరకాన్తిమ్,
పశ్యామి మన్మథఖరానలపీడితాని
గాత్రాణి యా మమ కరోతి సుశీతలాని. 93

టీ. యా=ఏచంద్రవదన, మన్మథ...పీడితాని-మన్మథ = మన్మథుఁడనెడు, ఖర=తీక్ష్ణమయిన, అనల=అగ్నిచే, పీడితాని=బాధింపఁబడిన, మమ= నాయొక్క, గాత్రాణి=అవయవములను, సుశీతలాని=మిగుల చల్లనివానిని గా, కరోతి=చేయునో, తాం=ఆ, శశిముఖీం = చంద్రునివంటిముఖము కలిగినదియు, నవ...నాఢ్యాం-నవ=నూతనమగు, యౌవన=యౌవనముచే, ఆఢ్యాం=పూర్ణురాలగునదియు, పీనస్తనీం-పీన=బలిసిన, స్తనీం=స్తనములు కలిగినదియు, ఘనకచాం-ఘన = మేఘసదృశమగు, కచాం=కేశపాశము కలిగినదియు, అతిగౌరకాంతిం-అతి-మిగుల, గౌర=పచ్చనగు, కాంతిం= శరీరకాంతిగలిగినదియు (నగుప్రియురాలిని), అద్యాపి=ఇప్పుడును, పశ్యామి =చూచుచున్నాను.

తా. మదనతాపసంతప్తుఁడనై యుండుసమయమున నాశరీకల నీడేర్చి పరమానందంబునఁ దేల్చుచుండునది యథోచితములగు తత్తదవయవములచే మిగులప్రకాశించుచుండునదియునగు నాలలనామణి యిప్పుడు నాకనులకుఁ గట్టిన ట్టగపడుచున్నయది.

అద్యాపి త న్మనసి సంపరివ ర్తతే మే
రాత్రౌ మయి క్షుతవతి క్షితిపాలపుత్ర్యా,
జీ వేతి మఙ్గళవచః పరిహృత్య రోషాత్
కర్ణేఽర్పితం కనకపత్త్ర మనాలపన్త్యా. 94

టీ. రాత్రౌ=(ఒకానొక) రాత్రియందు, మయి=నేను, క్షుతవతి=తుమ్మినవాఁడనై యుండఁగా, రోషాత్=(ప్రణయకలహముచేనైన)కోపము వలన, అనాలపంత్యా = మాటలాడకుండిన, క్షితిపాలపుత్ర్యా=యామినీపూర్ణతిలకచే, జీవేతి='చిరం జీవ' యనెడి, మంగళవచః=మంగళవచనము, పరిహృత్య=విడిచి, కనకపత్త్రం=బంగరుకమ్మ, కర్ణే=చెవియందు, అర్పితమిత్తియత్ =ఉంచఁబడెననుట యేదిగలదో, తత్=అది, మే=నాయొక్క, మనసి=మనస్సున, అద్యాపి=ఇప్పుడును, సంపరివర్తతే=మెలఁగుచున్నది.

తా. ఒకనాఁటిరాత్రి యాచెలి ప్రణయకలహముచేఁ గుపితురాలై యుండునపుడు నేను (బిల్హణుఁడు) తుమ్మగా 'చిరంజీవ'యని మంగళము నుచ్చరించిన తనపట్టుదల చెడిపోవునను బింకముచే నేమియు మాటలాడక నావిషయమై మంగళము నాచరింప కుండుటకును మనసొప్పక సువర్ణము కర్ణాభరణము నొండు నాచెవియం దలంకరించెను. ఇట్లు ప్రియురాలి పరమానురాగమును సూచించు నీవిషయము నామనస్సున నిప్పుడును మెలఁగుచునే యున్నది.

అద్యాపి తాం యది పునః కమలాయతాక్షీ
ముత్తుఙ్గపీవరపయోధరభారఖిన్నామ్,
సంపీడ్య బాహుయుగళేన పిబామి వక్త్ర
మున్మ త్తబమ్భర ఇ వామ్బురుహం య థేష్టమ్. 95

టీ. పునః=తిరిగి, (సంభవేత్) యది=సంభవించునెడల, ఉత్తుంగ...ఖిన్నామ్-ఉత్తుంగ=ఎత్తైనదియు, పీవర=బలిసినదియు (నగు), పయో

ధర=కుచములయొక్క, భార=బరువుచేత, ఖిన్నాం=శ్రమనం దెడునదియు, కమలాయతాక్షీం-కమల=పద్మమువలె, ఆయత=విశాలమైన, అక్షీం=కనులు గలిగినదియు (నగు), తాం = ఆతరుణీరత్నమును, బాహుయుగళేన= రెండుబాహువులచేతను, సంపీడ్య=గాఢాలింగనముచే పీడించి, ఉన్మత్తబంభరః=మదించిన తుమ్మెద, అంబురుహమివ = పద్మమునుపలె, వక్త్రం = (ప్రియురాలి) ముఖమును, యథేష్టం=స్వేచ్ఛగా, పిబామి=త్రాగెదను.

తా. తిరిగి యవకాశము సంభవించునేని సుందరతరములగు నవయవములచే విరాజిల్లు నాయువతీరత్నమును రెండుబాహువులచేతను గాఢముగ నాలింగనముఁజేసికొని యామెముఖమును ముద్దుఁగొనియెదను.

అద్యాపి తాం కుటిలకోమలకాలకేశీ
ము న్నిద్రతామరసపత్త్రవిశాలనేత్రామ్,
ప్రోత్తుఙ్గపీవరకఠోరపయోధరాఢ్యాం
ధ్యాయామి చేతసి యథైవ గురూక్తవిద్యామ్. 96

టీ. కుటిల...కేశీం-కుటిల = వంకలుదీరినవియు, కోమల=సుకుమారములైనవియు, కాల=నల్లనివియునగు, కేశీం=వెండ్రుకలుగలిగినదియు, ఉన్నిద్ర...నేత్రాం-ఉన్నిద్ర=వికసించిన, తామరస=కమలముయొక్క, పత్ర= దళమువలె, విశాల=విశాలములగు, నేత్రాం=నేత్రములు గలుగునదియు, ప్రోత్తుంగ...ఆఢ్యాం - ప్రోత్తుంగ=మిగుల నున్నతములును, పీవర=బలిసినవియు, కఠోర=కఠినములును (నగు), పయోధర=స్తనములచే, ఆఢ్యాం= పూర్ణయు (నగు), తాం=ఆకామినీరత్నమును, గురూక్తవిద్యాంయథా - గురు=గురువుచే, ఉక్త=చెప్పఁబడిన, విద్యాంయథా=విద్యనుపలె, చేతసి= మనస్సున, అద్యాపి=ఇప్పుడును, స్మరామి=తలఁచెదను.

తా. సుకుమార నీల కుటిలకుంతలయు, వికచారవిందదళ విశాలనేత్రయు, పీవరకఠి నోన్నత కుచయునగు నారమణీమణిని గురూపదిష్టంబైయుండు విద్యను వలెనె రసానుభవపూర్వకముగా స్మరియింతును.

అద్యాపి త న్ముకుళకున్దసమానద_న్తం
తిర్యగ్వివ_ర్తితవిలోలవిలోచనా_న్తమ్,
తస్యా ముఖం త్వతితరాం న హి విస్మరామి
చి_త్తే కృతజ్ఞ ఇవ సాధుకృతోపకారమ్. 97

టీ. ముకుళ...ద_న్తం - ముకుళ=మొగ్గలరూపములగు, కుంద=మల్లెలతో, సమాన=సమములగు,దంతం=పండ్లుగలిగినదియు, తిర్యక్...అంతం-తిర్యక్=అడ్డముగా, వివ_ర్తిత=త్రిప్పఁబడినవియు, విలోల=చంచలము లగునవియు(నగు),విలోచన=కనులయొక్క,అంతం=చివరలుగలిగినదియు, తస్యాః = ఆసుందరీమణియొక్క, తత్=ఆ, ముఖం=ముఖమును, సాధు...కారం-సాధు=సజ్జనులచే,కృత=చేయఁబడిన, ఉపకారం=ఉపకారమును, కృతజ్ఞ ఇవ=కృతజ్ఞుఁడువలె, చి_త్తే=మనసున,అద్యాపి=ఇప్పటికిని, అతితరాం=మిక్కిలి, నవిస్మరామిహి= మరువనుసుమా!

తా. సజ్జనులుచేసిన యుపకారమును కృతజ్ఞుఁడుమరువనట్లుమల్లెమొగ్గలఁబోలు పలువరుసగలుగు నాకాంతామణి కనులనడ్డముగఁద్రిప్పుచు ప్రసరింపఁజేసిన క్రేఁగంటిచూపులను నే నెప్పటికిని మరువంజాలను.

అద్యాపి తన్మదనకార్ముకలగ్నభృఙ్గ
బృన్దద్యుతిప్రకరకర్బురితాలకా_న్తమ్,
కర్ణావస_క్తవిమలోజ్జ్వలద_న్తపత్త్రం
తస్యాః పునః పున ర పీహ ముఖం స్మరామి. 98

టీ. మదన...అంతం-మదన=మన్మథునియొక్క, కార్ముక=ధనుస్సునందు, లగ్న = తగుల్కొని యుండెడు, భృంగ=తుమ్మెదలయొక్క, బృంద = సమూహముయొక్క, ద్యుతిప్రకర = కాంతిసమూహమువలె, కర్బురిత = నలుపుగలిగిన, అలక = ముంగురులయొక్క, అంతం = కొనలు గలిగినదియు, కర్ణ...పత్త్రం - కర్ణ = చెవులయందు, ఆవస_క్త=కూర్చఁ

బడిన, విమల=స్వచ్ఛమైనట్టియు, ఉజ్జ్వల=ప్రకాశించునట్టి, దంతపత్రం=దంతపుకమ్మలు గలదియు, తస్యాః=ఆమెయొక్క, తత్=ఆ, ముఖం=ముఖమును, పునఃపునరపి=తిరిగితిరిగి, ఇహ=ఇచ్చట, స్మరామి = తలంతును.

తా. తుమ్మెదపిండును బోలియుండు ముంగురులు గలదియు, దంతపు కర్ణపత్రములచేనలంకృతమైనదియు నగునాసుందరి సుందరవదనారవిందమును అమందానందంబున నిప్పు డిచ్చట తనివిదీర శతసహస్రపర్యాయంబులు స్మరింతును.

అద్యాపి తాం ఝుడితి వక్రితకన్ధరాఢ్యాం
నిక్షిప్తపాణికమలా న్తనితమ్బబిమ్బామ్,
వామాంసపార్శ్వలసదుల్బణకేశపాశాం
పశ్యామి మాం ప్రతి దృశం బహుధా క్షిప న్తీమ్. 99

టీ. ఝుడితి=శీఘ్రముగా, వక్రితకంధరాఢ్యాం-వక్రిత=వంచఁబడిన, కంధర=మెడచే, ఆఢ్యాం=ఆఢ్యురాలును, నిక్షిప్త...బింబాం-నిక్షిప్త=ఉంచఁబడిన, పాణికమల=హస్తపద్మముగలిగి, అంత=మధ్యభాగముగల, నితంబ బింబాం = నితంబమండలముగలిగినదియు, వామ...పాశాం-వామ=ఎడమదగు, అంసపార్శ్వ=భుజమువైపు, లసత్=ఒప్పుచుండు, ఉల్బణ = విస్తృతమయిన, కేశపాశాం = కేశసమూహముగలదియు, మాంప్రతి = నన్నుఁగూర్చి, బహుధా=అనేకవిధముల, దృశం=దృష్టిని, క్షిపంతీం=చల్లుచున్న, తాం=ఆయువతిని, అద్యాపి=ఇప్పటికిని, పశ్యామి=చూచుచున్నాను.

తా. తటాలున తలనొక వైపునకొంచి విశాలమగు నితంబప్రదేశమున పాదకమలమునుంచి తనకెడమవైపున కేశభారమంతయు వ్రేలుచుండ నావైపునకు విలాసముగ దృష్టులం బఱపుచుండు నాతలోదరి నిప్పుడును గనుచున్నాఁడను.

అద్యాపి త త్సరలవఃజ్ఞులతుజ్గనాసం
కిఞ్చిత్ స్ఫుటోల్లసితమాంసలపాణ్డుగణ్డమ్,

పశ్యామి పూర్ణశరదిన్దుసమానకాన్తి
కాన్తాముఖం వికచపఙ్కజపత్త్రనేత్రమ్. 100

టీ. సరస... నాసం- సరస=సరియైనట్టియు, మంజుల = మనోహరమైనట్టియు, తుంగ=ఉన్నతమైన, నాసం=ముక్కుగలిగినదియు, కించిత్...గండం-కించిత్ = కొంచెము, స్ఫుట=స్పష్టమై, ఉల్లసిత=వికసించినట్టియు, మాంసల=బలిసినట్టియు, పాండు = తెల్లనైనట్టి, గండం=చెక్కిళ్లు గలిగినదియు, పూర్ణ...కాంతిం—పూర్ణ=పూర్ణుఁడైన, శరదిందు=శరత్కాలచంద్రునితో సమాన=సమానమగు, కాంతిం=కాంతిగలిగినట్టిదియు, వికచ ...నేత్రం-వికచ=విచ్చిన, పంకజ = పద్మముయొక్క, పత్త్ర = దళమువంటి, నేత్రం = నేత్రములుగలిగినదియు (నగు), కాన్తాముఖం = ప్రియురాలిముఖమును, అద్యాపి = ఇప్పుడును, పశ్యామి=చూచుచున్నాను.

తా. తత్తదుచితమగురీతిని అవయవములయొక్క సన్నివేశసందర్భములం గలిగియుండుటచే నత్యధికవిలాసంబులకు నిలయంబై నాచే పూర్వ మనుభవింపఁబడియుండు ప్రియురాలియొక్క పూర్ణచంద్రసమానంబగు ముఖము నా కిప్పటికిని నగుపడుచున్నయది.

అద్యాపి తా మవిగణయ్య కృతాపరాధం
మాం పాదమూలపతితం బహుధా క్షిపన్తీమ్,
వస్త్రాఞ్చలం మమ కరా న్నిజ మాకృషన్తీం
మా మేతి రోషపరుషం రుదతీం స్మరామి. 101

టీ. కృతాపరాధం-కృత = చేయఁబడిన, అపరాధం = అపరాధము కలిగినట్టియు, పాద...పతితం-పాదమూల = పాదములయందు, పతితం = పడియుండునట్టి, మాం = నన్ను, అవిగణయ్య = లెక్కచేయక, బహుధా= అనేకవిధముల, క్షిపంతీం=నిందించుచుండినదియు, మమ= నాయొక్క, కరాత్ = చేతినుండి, నిజం = తనసంబంధమగు, వస్త్రాంచలం = చీరచెఱఁగును, ఆకృషంతీం = లాగుచుండినదియు, మామేతి= వద్దువద్దని, రోషపరుషం -

రోష=కోపముచే, పరుషం = కఠినమగునట్లు, రుదతీం = ఏడ్చుచుండిన, తాం=ఆ కాంతను, అద్యాపి=ఇప్పుడును, స్మరామి=తలంచుచున్నాను.

తా. ఒకకాలంబున నే నొకవిషయంబున నేరము సలిపి తత్ క్షమాపణము కొఱకు ఆమెపాదంబులంబడి ప్రార్థించుచుండ లెక్కచేయక అనేకవిధముల నిందించుచు నాప్రార్థనమును త్రోసిపుచ్చి పిమ్మట నను నయమునకై నేనామె చీరచెఱఁగును పట్టుకొనఁగా వలదు వలదని చెప్పుచు రోషముచే నేడ్చుచు చీరను లాగుకొనుచుండిన యప్పటియామెస్థితి నిప్పటికిని స్మరించుచున్నాను.

అద్యాపి తా మతివిశాలనితమ్బబిమ్బాం
గమ్భీరనాభికుహరాం తనుమధ్యభాగామ్,
అమ్లానకోమలమృణాలసమానబాహుం
లీలాలసాఞ్చితగతిం మనసా స్మరామి. 102

టీ. అతి...బింబాం - అతి=మిగుల, విశాల=విశాలమగు, నితంబ=పిఱుఁదులయొక్క, బింబాం = మండలముగలదియు, గంభీర...కుహరాం- గంభీర = గంభీరమగు, నాభికుహరాం = నాభీరంధ్రముగలదియు, తను...భాగాం - తను = సూక్ష్మమగు, మధ్యభాగాం = నడుముప్రదేశముగలదియు, అమ్లాన...బాహుం-అమ్లాన = వాడని, కోమల=మృదువగు, మృణాల = తామరతూఁడునకు, సమాన = సరియగు, బాహుం - భుజములుగలిగినదియు, లీలా...గతిం-లీలా = విలాసముచే, అలస = మందమై, అంచిత= మనోహరమైన, గతిం=నడకగలిగినదియు (నగు), తాం = ఆవిలాసవతిని, అద్యాపి = ఇప్పుడును, మనసా=మనస్సుతో, స్మరామి=తలంచెదను.

తా. విశాలములగు పిఱుఁదులును లోఁతగు పొక్కిలియుసూక్ష్మమగు నడుమును మృదువులై సుకుమారములగు భుజములును మందమై విలాసయుక్తమగు నడకయుఁ గలిగి యలరారుచుండు నావిలాసవతిని యిప్పటికిని మనస్సున స్మరించుచున్నాను.

అద్యాపి తత్ లలితచారునిమీలితాక్షం
వక్త్రం స్మరామి సరసం సురతావసానే,
తత్కాలనిశ్వసితవాతవిధూతకాన్త
స్వేదోదబిన్దుపటలస్ఫురితం ప్రియాయాః. 103

టీ. సుర...సానే - సురత = సంభోగముయొక్క, అవసానే = అంతమునందు, లలిత...అక్షం - లలిత = అందమై, చారు = మనోహరమై, నిమీలిత=మూయఁబడిన, అక్షం=కనులుగలిగినదియు, తత్...స్ఫురితం— తత్కాల = ఆకాలమునందలి, నిశ్వసిత వాత = నిట్టూర్పుగాలిచేత, విధూత=ఎగురఁగొట్టఁబడిన, కాంత=మనోహరమగు, స్వేదోదబిందు = చెమట నీటి బిందువులయొక్క, పటల = సమూహముచేత, స్ఫురితం=ప్రకాశింపఁ జేయఁబడినదియు, సరసం = (ఆనంద) రసముతోఁగూడినదియు (నగు), ప్రియాయాః=ప్రియురాలియొక్క, తత్=ఆ, వక్త్రం=మోమును, అద్యాపి=ఇప్పుడును, స్మరామి=తలఁతును.

తా. సంభోగాంతమం దానందాతిశయముచేతను అలసటచేతను కనులు మూసి అందమై మనోహరమై రతిశ్రమచేఁ బొడమిన నిశ్వాసంబు లతితరంబులై ప్రవర్తించి చెమ్మటచుక్కల నెగురఁగొట్టుచుండ శోభావిశేషంబునుఁ బొందియుండు నాసుందరివదన మిప్పటికి నామనమున ప్రత్యక్షమై పొడకట్టుచున్నది.

అద్యాపి తాం మయి కృతాగసి రుష్టభావాం
బాష్పామ్బుసంతతిముహుర్న్నిగృహీతవాచమ్,
అన్తర్న్నిరుద్ధఘనమన్యుసబాష్పకణ్ఠీం
నిశ్వాసశుష్యదధరాం రుదతీం స్మరామి. 104

తా. మయి=నేను, కృతాగసి - కృత=చేయఁబడిన, ఆగసి=తప్పుగలవాఁడనైయుండఁగా, రుష్టభావాం- రుష్ట=రోషించిన, భావాం=మనస్సు గలిగినదియు, బాష్ప...వాచం-బాష్పాంబు=కన్నీటియొక్క, సంతతి=సమూ

హముచే, ముహుః=మాటిమాటికి, నిగృహీత = అరికట్టఁబడిన, వాచం = మాటలుకలిగినదియు, అన్తః...కంఠీం-అన్తః=తనలో, నిరుద్ధ=అణచి పెట్టఁబడిన, ఘన=గొప్ప, మన్యు=విచారముచేత, సబాష్ప = బాష్పములతోఁగూడిన, కంఠీం = కంఠముగలదియు, నిశ్వాస...దధరాం-నిశ్వాస = నిట్టూర్పులచే, శుష్యత్=ఎండుచున్న, అధరాం = అధరోష్ఠముగలదియు, రుదతీం = ఏడ్చునదియు (నగు), తాం=ఆమానినిని, అద్యాపి= ఇప్పుడును, స్మరామి = తలఁచెదను.

తా. నే నొకసారి ఆమెవిషయమున నపరాధము సలుపరోషముగలిగి కన్నీరు కాలువలై మాటల నరికట్టుచుండ దుఃఖము నణచుకొనుచుండుటచే కంఠము బాష్పములచే నిండియుండ నిట్టూర్పులచే పెదవు లెండుచుండ నేడ్చునామానవతి నిప్పుడును తలఁచుచున్నాను.

అద్యాపి తాం మదపనీతనితమ్బవస్త్రాం
పశ్యామి సాధ్వసరసాకులవిహ్వలాఙ్గీమ్,
ఏకేన పాణికమలేన పిధాయ గుహ్యా
మన్యేన నాభికుహరం దధతీం స్మరామి. 105

టీ. మత్...వస్త్రాం-మత్=నాచేత, అపనీత=తొలఁగించఁబడిన, నితంబ = నితంబప్రదేశమందలి, వస్త్రాం=వస్త్రముగలిగినదియు, సాధ్వస...అంగీం-సాధ్వస=లజ్జచేతను, రస = అనురక్తిచేతను, ఆకుల = వ్యాకులమైనట్టియు, విహ్వల = తొందరగల, అంగీం=శరీరముగలిగినదియు, ఏకేన = ఒక, పాణికమలేన = పద్మమువంటిహస్తముచే, గుహ్యాం=గుహ్యాంగమును, పిధాయ=మూసి, అన్యేన = రెండవహస్తముచే, నాభికుహరం=నాభిరంధ్రమును, దధతీం=ధరించియుండెడు, తాం=ఆసుందరిని, స్మరామి=తలఁచెదను.

తా. ఒకసారి విలాసమునకై నే నావిలాసినినితంబప్రదేశమునందలి వస్త్రమును లాగివేయఁగా లజ్జచే తొందరపడుచు ఒకచేతితో గుహ్యమును

రెండవదానిలో పాక్కిలిని మూసికొనియుండు నాసుందరిసన్నివేశము నా
కిప్పుడు తలంపునకు వచ్చుచున్నది.

అద్యాపి తాం రహసి దర్పణవీక్ష్యమాణ
సంక్రాన్త మత్ప్రతినిధిం మయి పృష్ఠలగ్నే,
పశ్యామి వేపథుమతీం చ ససంభ్రమాం చ
లజ్జాకులాం చ సముదఞ్చితమన్మథాం చ. 106

టీ. రహసి=రహస్యమునందు, మయి = నేను, పృష్ఠలగ్నే-పృష్ఠ=వెనుక, లగ్నే=తగిలినవాఁడనైయుండఁగా, దర్పణ...నిధిం-దర్పణ=అద్దమున, వీక్ష్యమాణ=చూడఁబడుచు, సంక్రాంత=సంక్రమించిన, మత్=నాయొక్క, ప్రతినిధిం=ప్రతిబింబముకలదియు, వేపథుమతీంచ=వణకుచున్నదియు, ససంభ్రమాంచ=తొందరతోకూడుకొనినదియు, లజ్జాకులాంచ-లజ్జా=సిగ్గుచే, ఆకులాంచ=వ్యాకులమందుచున్నదియు, సముదంచితమన్మథాంచ-సముదంచిత = పెంపొందిన, మన్మథాంచ=మన్మథుఁడుకలదియు (నగు), తాం=ఆ మోహినిని, అద్యాపి=ఇప్పుడును, పశ్యామి=చూచుచున్నాను.

తా. ఒకసారి యావిలాసవతి అద్దమును చూచుకొనుచుండఁగా నేను వెనుకభాగమునంటి నిలువ నద్దమున కనఁబడుచుండు ప్రతిబింబమునుచూచి తొందరతో వణఁకుచు లజ్జ నందుచు కామావేశము కలదై యొప్పు నాప్రియురాలిని యిప్పుడును చూచుచున్నాను.

అద్యాపి తాం సురభిదర్దురగణ్డభాగం
ధావ_న్త మాస్యకమలం ప్రతి చఞ్చరీకమ్,
కిఞ్చిచ్చలచ్చకితకుఞ్చితచారునేత్రాం
పశ్యామి కేళికమలేన నివారయ_న్తీమ్. 107

టీ. సురభి...భాగం-సురభి = పరిమళించునదియు, దర్దుర = గగుర్పొడిచినదియు(నగు), గండ=కపోలములయొక్క, భాగం=ప్రదేశముగల

ఆస్యకమలంప్రతి=కమలమువంటి ముఖమునుగూర్చి, ధావన్తం=పరుగిడుచుం డు, చంచరీకం=తుమ్మెదను, కేళికమలేన=విలాసార్థమగుపద్మముచే, నివార యన్తీం=నివారించుచున్నదియు, కించి...నేత్రాం-కించిత్ = కొంచెము, చలత్ =కదలుచున్నదియు, చకిత=భయపడినదియు, కుంచిత=ముడుపఁబడిన దియు, చారు=మనోహరమైనదియు (నగు), నేత్రాం=కనులుగల, తాం= ఆవిలాసవతిని, అద్యాపి=ఇప్పుడును, పశ్యామి=చూచుచున్నాను.

తా. కమలమువలె పరిమళింపుచు గగుర్పాటుఁ గలిగియుండు నామె ముఖమువద్ద తిరుగుచుండు తుమ్మెదను చేత విలాసముకొఱకు పట్టుకొనియుం డు పద్మముచే తోలుచు నేత్రములను బెదురుచేఁ గదుపుచు కొంచెముమూసి యుండు నామెను ఇప్పటికిని చూచుచున్నాను.

అద్యాపి తాం మయి గతే పురతశ్చ పశ్చా
ద_న్త ర్బహిః పరిత ఏవ పరిభ్రమ_న్తీమ్,
పశ్యామి ఫుల్లకనకామ్బుజకోమలేన
వక్త్రేణ తిర్యగనువ_ర్తితలోచనేన. 108

టీ. మయి=నేను, గతే=వెడలినవాఁడనైయుండఁగా, ఫుల్ల...కోమ లేన-ఫుల్ల=వికసించిన, కనక=బంగరుదగు, అంబుజ = పద్మమువలె, కోమ లేన=మృదువగు, తిర్యక్...లోచనేన-తిర్యక్ = అడ్డముగా, అనువర్తిత= త్రిప్పఁబడిన, లోచనేన=నేత్రములుగల, వక్త్రేణ=ముఖములోఁగూడ, పుర తః=ముందును, పశ్చాత్=వెనుకను, అంతః=లోపలను, బహిః=వెలుపలను, పరితః=చుట్టును, పరిభ్రమన్తీం=తిరుగుచుండెడు, తాం=ఆకామినిని, అద్యా పి=ఇప్పుడును, పశ్యామి=చూచుచున్నాను.

తా. చమత్కారమున కొకసారి నేను వెలుపలకు వెడలినవాఁడగు చుండ నేత్రముల నడ్డముగఁ ద్రిప్పి వికసించిన బంగరుకమలమువలె నుండు ముఖముగలదై గృహమున సమస్తపార్శ్వములయందును నాకొఱకు వెదకు చు తిరుగుచుండు నాకామినిని ఇప్పటికిని చూచుచున్నాను.

అద్యాపి తాం మయి కవాటసమీపలీనే
మన్మార్గదత్తదృశ మాననదత్తహస్తామ్,
మద్గోత్రచిహ్నితపదాం మృదుకాకలీభిః
కిఞ్చిత్తరఙ్గమనసా మనసా స్మరామి. 109

టీ. మయి=నేను, కవాట...లీనే-కవాట = తలుపుయొక్క, సమీప=సమీపమున, లీనే=దాఁగియుండ, మత్...దృశం-మత్=నాయొక్క, మార్గ=మార్గమున, దత్త=ఉంచఁబడిన, దృశం=దృష్టిగలదియు, ఆనన...హస్తాం-ఆనన=ముఖమున, దత్త=ఉంచఁబడిన, హస్తాం = చేయిగలదియు, మత్...పదాం-మత్=నాయొక్క, గోత్ర=పేరుచే, చిహ్నిత=గుర్తించఁబడిన, పదాం = శ్లోకపాదములుగలదియు, కించిత్తరంగమనసా - కించిత్ = కొంచెము, తరంగ=తరంగములుగల, మనసా=మనస్సులో, ఉపలక్షితాం=కూడుకొనినదియు (నగు), తాం = ఆరాగవతిని, మనసా=మనస్సులో, స్మరామి=తలఁచెదను.

తా. విలాసమున నొకసారి యామెకు తెలియకుండ తలుపుమూల దాఁగియుండ నే నెచ్చటికో యరిగితి నని తలఁచి నారాకకై నామార్గము వైపు చూచుచు నే నగపడకుండుటచే విచార ముదయమై చేతియందు ముఖము నుంచుకొని అనురాగ మతిశయించుచుండ మనసు చలించి తరంగములు గలుగుచుండు మృదువులును అవ్యక్తమధురములును నగు స్వరములచే పాటలయందలి నానామము చేర్చఁబడియుండు పాదములను పాడుచునుండు నామె స్థితివిశేషమును మనసున స్మరించుకొనుచున్నాను.

అద్యాపి తాని మమ చేతసి సంస్ఫురన్తి
కర్ణాన్తసంగతకటాక్షనిరీక్షణాని,
తస్యాః స్మరజ్వరహరాణి మదాలసాఙ్గ్యా
లీలావిలాసచటులాని విలోకనాని. 110

టీ. మద...అంగ్యాః-మద=మదముచేత, అలస=అలసిన,అంగ్యాః=దేహముగల, తస్యాః=ఆవిలాసినియొక్క, కర్ణ...ఈక్షణాని-కర్ణ = చెవుల యొక్క, అంత=చివరయందు, సంగత=కూడిన, కటాక్ష=నేత్రాంతముల యొక్క, నిరీక్షణాని = చూపులుగలిగినదియు, స్మర...హరాణి-స్మర=మన్మథునియొక్క, జ్వర=తాపమును, హరాణి=పోఁగొట్టునవియు, లీలా...చటులాని-లీలా=హేలచేతను, విలాస=విలాసముచేతను, చటులాని = చంచలములైనవియు (నగు), తాని=ఆ, విలోకనాని=దృష్టిప్రసారములు, అద్యాపి=ఇప్పుడును, మమ = నాయొక్క, చేతసి = మనస్సున, సంస్ఫురంతి= మిక్కిలిగ స్ఫురించుచున్నవి.

తా. కర్ణపర్యంతము వ్యాపించియుండు కనుల గొనలనుండి ప్రసరించినంతనే మన్మథతాపమును హరింపఁజాలినదై విలాసయుక్తములును చటులములు నగు నావిలాసినిచూపులు నామనసున మెలఁగుచున్నవి.

అద్యాపి తత్ తరళతారకితాక్ష మాస్య
మాలిప్తచన్దనరసాహితశోభ మస్యాః,
కస్తూరికాచటులపత్త్రలతాభిరామ
గణ్డస్థలద్యుతి ముహు ర్మనసా స్మరామి. 111

టీ. తరళ...అక్షం-తరళతారకిత=చంచలకనీనికాయుక్తమైన,అక్షం=కనులుగలదియు, ఆలిప్త...శోభం-ఆలిప్త=బాగుగ పూయఁబడిన, చందన= చందనముయొక్క, రస=ద్రవముచే,ఆహిత = సంపాదింపఁబడిన, శోభం= కాంతిగలదియు, కస్తూరికా...ద్యుతి-కస్తూరికా=కస్తూరి సంబంధమగు, చటుల=సుందరమైన, పత్ర = మకరికా పత్రములయొక్క, లతా=తీవలచే, అభిరామ=మనోహరమైన, గండస్థల = గండప్రదేశములయొక్క, ద్యుతి= కాంతిగలదియు (నగు), తస్యాః=ఆసుందరియొక్క, ఆస్యం=ముఖమును, అద్యాపి=ఇప్పుడును, ముహుః = మాటిమాటికి, మనసా = మనస్సుతో, స్మరామి=తలఁచెదను.

తా. చంచలములగు తారకములు గల కనులును స్వశోభ నభివృద్ధి నందించు చందనపుఁ బూఁతగలిగి కస్తూరిచే రచింపఁబడిన మకరికాపత్త్రములచే నొప్పుచుండు కపోలములు గలిగి ప్రకాశించుచుండు మనోహరమైన యామె ముఖము మాటిమాటికి నా కిప్పుడు స్మృతి నందుచున్నది.

అద్యాపి తత్ కుచకచగ్రహణాగ్రహేణ
దన్తైర్మయా దశనవాససి పీడ్యమానే,
తస్యాః సకృన్ముకుళితాక్ష మలక్ష్యమాణ
సీత్కారగర్భ మసకృద్వదనం స్మరామి. 112

టీ. కుచ...అగ్రహేణ-కుచ=కుచములయొక్కయు, కచ=కేశపాశముయొక్కయు, గ్రహణ=గ్రహించుటయందలి, అగ్రహేణ=పట్టులో, దన్తైః=దంతములచేత, మయా=నాచేత, దశనవాససి = అధరోష్ఠము, పీడ్యమానే = పీడింపఁబడుచున్నదై యుండఁగా, సకృత్...అక్షం- సకృత్ = ఒక్కసారి, ముకుళిత=మూయఁబడిన, అక్షం=కనులు గలిగినదియు, అలక్ష్య...గర్భం - అలక్ష్యమాణ=చూడఁబడుచుండని, సీత్కార=సీత్కారము, గర్భం = లోపలఁ గలిగియుండునదియు (నగు), తస్యాః = ఆబింబోష్ఠియొక్క, వదనం=ముఖమును, అద్యాపి=ఇప్పుడును, అసకృత్ = అనేకమారులు, స్మరామి=తలఁతును.

తా. ఆబింబాధరిం గనిన తమకంబున నామె కుచంబును గచంబును కేలంబట్టి మధురాధరంబును నేఁబంట నొక్కుచుండ ఆనందాతిశయంబునఁ గనుల మోడ్చి బంటి నొక్కనం గలుగు బాధచే జనించిన యుఁస్ అను ధ్వని లోననే యడఁగియుండ విరాజిల్లు నామె సుందరవదనము నిప్పటికి ననేకవారంబులు స్మరింతును.

అద్యాపి తాని హృదయే మమ సంస్ఫురన్తి
బిమ్బోష్ఠదేశపరికీర్ణశుచిస్మితాని,

పీయూషపూరమధురాణి చటూని తాని
వాక్యాని మన్మథరసేన మృదూని తస్యాః. 113

టీ. బింబ...స్మితాని-బింబ = బింబఫలమువంటి, ఓష్ఠ=అధరోష్ఠము యొక్క, దేశ=ప్రదేశమున, పరికీర్ణ=చల్లఁబడిన, శుచి=తెల్లనైన, స్మితాని= చిఱునగవులు గలిగినదియు, పీయూష...మధురాణి - పీయూష=అమృతముయొక్క, పూర=ప్రవాహమువలె, మధురాణి=తీయనివియు, చటూని= నిపుణములును, మన్మథరసేన—మన్మథ=కామముయొక్క, రసేన=రసముచేత, మృదూని=మృదువులైనవియు (నగు), తస్యాః=ఆమెయొక్క, తాని = ఆ, వాక్యాని=మాటలు, అద్యాపి=ఇప్పుడును, మమ = నాయొక్క, హృదయే= మనసున, సంస్ఫురంతి = మెలఁగుచున్నవి.

తా. దొండపండువంటి పెదవిభాగంబుల తెల్లని చిఱునగవుల వెదఁ జల్లుచు అమృత ప్రవాహంబు నాస్వాదించునప్పుడుఁ బోలె కర్ణంబుల కానందంబుఁ గొలుపుచు నేర్పును చాటుచున్నవై కామరసవశంబున మృదువులై యొప్పుచుండు నామధురవాణి మధురాలాపంబులు నాహృదయంబున నిప్పటికిని మెలంగుచునే యున్నవి.

అద్యాపి తాం కనకపత్త్రసునద్ధకర్ణా
ముత్తుఙ్గకర్కశకుచార్పితతారహారామ్,
కాఞ్చీనియన్త్రితవిశాలనితమ్బబిమ్బా
ముద్దామనూపురరణచ్చరణాం స్మరామి. 114

టీ. కనక...కర్ణాం - కనక=బంగరుయొక్క, పత్త్ర=కమ్మచే, సునద్ధ=బాగుగ కూర్పఁబడిన, కర్ణాం = చెవులు గలిగినదియు, ఉత్తుంగ...హారాం - ఉత్తుంగ=ఎత్తైనట్టియు, కర్కశ=కఠినమైనట్టియు, కుచ = కుచములయందు, అర్పిత=ఉంచఁబడిన, తార = ముత్తెములయొక్క, హారాం=హారములు గలిగినదియు, కాంచీ...బింబాం-కాంచీ = మొలనూలుచే, నియ

న్రిత=కట్టఁబడిన, విశాల=గొప్ప, నితంబ=పిఱుఁదులయొక్క, బింబాం=మండలము గలిగినదియు, ఉద్దామ...చరణాం-ఉద్దామ=గొప్ప, నూపుర=అందెలచే, రణత్ = ధ్వనించెడి, చరణాం = పాదములు గలిగినదియు (నగు), తాం=ఆమెను, అద్యాపి=ఇప్పుడును, స్మరామి=తలఁచుచున్నాను.

తా. కర్ణంబుల బంగరు కమ్మలును ఉన్నతములై కఠినములై వెలయు కుచభాగంబుల ముత్తెపుసరులును పిఱుఁదులపై మొలనూలును పాదపల్లవంబుల ధ్వనించు నూపురంబులునుగలిగి విరాజిల్లుచుండు నాకనకాంగి నిప్పుడును తలంచుచున్నాను.

అద్యాపి తాం భుజలతార్పితకణ్ఠభాగాం
వక్షస్స్థలం మమ పిధాయ పయోధరాభ్యామ్,
ఈషన్నిమీలితవిలోలవిలోచనాన్తాం
పశ్యామి మద్దశనచేలక మాపిబన్తీమ్. 115

టీ. భుజ...భాగాం - భుజలతా=లతవంటి భుజమున, అర్పిత=ఉంచఁబడిన, కంఠ=కంఠముయొక్క, భాగాం=భాగముగలదై, మమ=నాయొక్క, వక్షస్స్థలం = వక్షఃప్రదేశమును, పయోధరాభ్యాం = స్తనములచే, పిధాయ = కప్పి, ఈషత్...అంతాం - ఈషత్=కొంచెము, నిమీలిత = మూయఁబడిన, విలోల=చంచలమైన, విలోచన=నేత్రములయొక్క, అంతాం=కొనలుగలదై, మత్...చేలకం - మత్=నా, దశనచేలకం = అధరోష్ఠమును, ఆపిబన్తీం=త్రాగుచున్నదై (యుండు), తాం = ఆమెను, అద్యాపి=ఇప్పుడును, పశ్యామి=చూచుచున్నాను.

తా. తనభుజంబులచే నాకంఠంబును బెనవైచిపట్టి స్తనంబుల నావక్షంబునన దిమియుంచి ఆనందపారవశ్యంబున కనులనుమూసి నాయధరంబు నానెడు నాకామినియొక్క యప్పటిస్థితిని ఇప్పుడును కనులం గట్టినట్లు చూచుచున్నాను.

అద్యాపి తాని పరివర్తితకన్ధరాణి
చఞ్చత్కుచత్రుటితమౌక్తికజాలకాని,
తస్యా భుజాగ్రలసదుల్బణకున్తలాని
చిత్తే స్ఫురన్తి మమ వక్రవిలోకనాని. 161

టీ. పరివర్తితకన్ధరాణి-పరివర్తిత=త్రిప్పఁబడిన, కన్ధరాణి=మెడగలవి యు, చంచత్...జాలకాని - చంచత్ = బలియుచుండు, కుచ=స్తనముల నుండి, త్రుటిత=తెగిపడిన, మౌక్తిక = ముత్తియముల, జాలకాని=సరులు గలిగినదియు, భుజ...కున్తలాని - భుజ=భుజములయొక్క, అగ్ర=చివరల యందు, లసత్ =ప్రకాశించుచుండు, ఉల్బణ = విస్తృతమైన, కున్తలాని= కేశపాశము గలిగినదియు (నగు), తస్యాః=ఆమెయొక్క, తాని=ఆ, వక్ర విలోకనాని - వక్ర=వంకరలగు, విలోకనాని = చూపులు, అద్యాపి=ఇప్పు డును, మమ=నాయొక్క, చిత్తే=మనస్సున, స్ఫురన్తి=స్ఫురించుచున్నవి.

తా. విలాసవిశేషంబుచే మెడను ద్రిప్పి కామోద్రేకంబుచేఁ జను లుబికి హారములు తెగి ముత్తియములు రాలుచుండ వీడిన కేశపాశమంతయు భుజములపై నుండి సుందరముగ వ్రేలుచుండ చూచుచుండు నావిలాసిని వక్రదృష్టి లిప్పటికి నామనసున మెలఁగుచున్నవి.

అద్యాపి తత్ సపరివేషశశిప్రకాశ
మాస్యం స్మరామి దృఢగాత్రవివర్తనేషు,
ఉద్వేల్లదుల్బణకరాఙ్గులిజాలగుమ్ఫ
దోఃకన్దలీయుగళమణ్డలితం ప్రియాయాః. 117

టీ. దృఢ...వివర్తనేషు - దృఢ=దృఢమైన, గాత్ర = ఒడలియొ క్క, వివర్తనేషు=విఋపులయందు, ఉద్వేల్లత్...మణ్డలితం - ఉద్వేల్లత్= ఎగయుచున్నట్టిదియు, ఉల్బణ = పూర్ణమైనదియు, కర = చేతియొక్క, అంగుళిజాల = వ్రేలి సమూహముయొక్క, గుంఫ = గుంఫనము గలిగినదియు

(నగు), దోః కందళీ=మొలకలవంటి బాహువులయొక్క, యుగళ=జంటచే, మణ్డలితం=చుట్టఁబడినదియు, సపరివేష...ప్రకాశం-సపరివేష=పరిధితోఁ గూడిన, శశి=చంద్రునియొక్క, ప్రకాశం=కాన్తివంటి కాన్తిగలిగినదియు (నగు), ప్రియాయాః = ప్రియురాలియొక్క, తత్=ఆ, ఆస్యం=ముఖమును, అద్యాపి=ఇప్పుడును, స్మరామి=తలఁచుచున్నాను.

తా. ప్రియురాలు బలములై యుండుచేతుల రెంటిని పైకెత్తి వ్రేళ్ళ నొండొంటఁ బెనవైచి దృఢముగ నొడలు విఱుచుకొనునపుడు చేతులు రెండును ముఖముచుట్టును మండలాకారముగ వ్యాపించి గుడి కట్టఁబడియుండు చంద్రునివలె ప్రకాశించుచుండు నాచంద్రముఖి ముఖముయొక్క సౌందర్య మిప్పుడును నాతలంపున మెలఁగుచున్నది.

అద్యాపి తా మనునయ త్యపి మ య్యశక్యాం
వ్యావృత్య కేళిశయనే శయితాం పరాచీమ్,
నిద్రాలసా మివ మ మాభిముఖం పతన్తీం
ప్రాత ర్మదఙ్గనిహితైకభుజాం స్మరామి. 118

టీ. మయి=నేను, అనునయత్యపి = వేఁడుకొనుచున్నవాఁడనైనను, అశక్యాం=సాధ్యము కానిదియు, కేళిశయనే=క్రీడాశయ్యయందు, పరాచీం=పెడమొగమై, వ్యావృత్య = తిరిగి, శయితాం = పండుకొనినదియు, ప్రాతః=తెల్లవాఱునపుడు, నిద్రాలసామివ - నిద్రా=నిద్దురచే, అలసామివ= బడలినదివలె, మమ=నాకు, అభిముఖం=ఎదురుగా, పతన్తీం=తిరుగుచున్నదై, మత్...భుజాం - మత్=నాయొక్క, అంగ=శరీరమున, నిహిత=ఉంచఁబడిన, ఏక=ఒక, భుజాం=భుజము గలదియు (నగు), తాం=ఆమెను, అద్యాపి=ఇప్పుడును, స్మరామి=తలఁచుచున్నాను.

తా. ఒకసమయమున ప్రణయకలహముచే తాను కోపించి నేనెంత బ్రతిమాలినను మానమును విడువక క్రీడార్థముగ నుపయోగింపఁబడు శయ్యయందే నాకు పెడమొగముగఁ దిరిగి నిద్రించి తిరిగి నిద్దురలేచునపుడు నిద్దుర

బడలికచే సెలుఁగనటు నటించుచు నావైపునకుం దిరిగి నాపై చేయివైచు చుండు నాప్రణయవతి నిప్పుడును తలఁచుచున్నాను.

అద్యాపి తాం స్మితముఖీం పురుషాయితేషు
లమ్బాలకాకులకపోలతలాం స్మరామి,
ఆన్దోళనశ్రమజలస్ఫుటసాన్ద్రబిన్దు
శ్వాసోత్తరం చ నిభృతం చ ముహుర్వదన్తీమ్. 119

టీ. పురుషాయితేషు = ఉపరికేళులయందు, స్మితముఖీం - స్మిత= చిరునగవుతోఁగూడిన, ముఖీం=ముఖము గలిగినదియు, లంబ...తలాం-లంబ=వ్రేలుచుండు, అలక=ముంగురులచే, ఆకుల=వ్యాకులమగు, కపోలతలాం =గండభాగము కలిగినదియు, ఆందోళన...బిందు - ఆందోళన=కదలికచే నగు, శ్రమజల=చెమ్మటయొక్క, స్ఫుట=స్పష్టమైనదియు, సాంద్ర=దట్టమైనట్టియు, బిందు=బిందువులు కలుగునట్లును, శ్వాసోత్తరంచ - శ్వాస= నిట్టూర్పులచే, ఉత్తరంచ=అధిక మగునట్లును, నిభృతంచ=మందమగునట్లును, ముహుః = మాటిమాటికి, వదన్తీం = పలుకుచుండునదియు (నగు), తాం= ఆమెను, అద్యాపి=ఇప్పుడును, స్మరామి=తలఁచుచున్నాను.

తా. ఉపరిక్రీడా సమయంబులయందు కేశపాశము వీడి ముంగురులు ముఖంబున చిందరవందరలై వ్యాపించియుండ ఆందోళనచే కలిగినచెమట చుక్కలు ముఖంబున స్పష్టముగను దట్టముగను నలమికొనియుండ నిట్టూర్పులు ప్రవాహంబులై పఱతెంచుచుండ రహస్యముగ చిరునగవుతోఁగూడ నేమో పలుకుచుండు నాకామినీమణి సన్నివేశవిశేషము నిప్పటికిని స్మరించుచున్నాను.

అద్యాపి తాం చిరగతే మయి కామభారా
చ్ఛయ్యాం సమాగతవతీం పరివర్తమానామ్,
ద్వారి స్థితాం కిమపి సంవలితాం నిషణ్ణాం
సఖ్యా సమాగతవతీం రుదతీం స్మరామి. 120

టీ. మయి=నేను, చిరగతే - చిర=చాలసేపు, గతే=పోయినవాఁడనై యుండఁగా, కామభారాత్ - కామ=కామముయొక్క, భారాత్=ఆధిక్యమువలన, శయ్యాం=పడకను, సమాగతవతీం=పొందినట్టిదియు, పరివర్తమానాం=దొర్లుచున్నదియు, కిమపి=ఏమో, సంవలితాం=ముడుచుకొనినదై, నిషణ్ణాం = కూర్చుండినదియు, ద్వారిస్థితాం=ద్వారమునం దుండునదియు, సఖ్యా = చెలికత్తెతో, సమాగతవతీం = కలసినదై, రుదతీం = ఏడ్చునదియు (నగు), తాం=ఆమెను, అద్యాపి=ఇప్పుడును, స్మరామి=తలంచుచున్నాను.

తా. నేనెచ్చటికైన నరిగి కొంతకాలమువఱకు రాక విళంబముఁజేసితినేని కామాధిక్యంబును సహింపఁజాలక శయ్యం జేరి దొర్లుచును ద్వారంబునందుండి చూచుచు ఏమియు తోఁచక ముడిగి కూర్చుండుచును చెలికత్తియతోఁ గూడినపుడు దుఃఖము బయలువెడలుటచే నేడ్చుచును నాయందాసక్తితో నిట్లు మెలంగుచుండు నాసుందరిం దలంచుచున్నాఁడను.

అద్యాపి తా మనిభృతక్రమ మాగతం మాం
ద్వారి ప్రవీక్ష్య శయనే నిమిషేణ సుప్తామ్,
మన్దం మయి స్పృశతి కఞ్చుకితాఙ్గయష్టి
ముత్ఫుల్లగణ్డపులకాం బహుశః స్మరామి. 121

టీ. అనిభృతక్రమం - అనిభృత = రహస్యముకాని, క్రమం=రీతిని, ఆగతం=వచ్చిన, మాం=నన్ను, ద్వారి = ద్వారమున, ప్రవీక్ష్య=చూచి, శయనే=శయ్యయందు, నిమిషేణ=నిమిషములో, సుప్తాం=నిద్రించినదియు, కంచుకిత...యష్టిం-కంచుకిత=కంచుకము గలిగిన, అంగయష్టిం=యష్టివంటి శరీరమును, మయి=నేను, మందం = మెల్లగా, స్పృశతి=ముట్టినవాఁడనై యుండఁగా, ఉత్ఫుల్ల...పులకాం - ఉత్ఫుల్ల=వికసించిన, గణ్డ=గండస్థలమునందలి, పులకాం = గగుర్పాటుగలిగినదియు (నగు), తాం=ఆమెను, బహుశః=అనేకపర్యాయములు, స్మరామి=తలఁతును.

తా. నేను వెలుపలికి కరిగి తిరిగి వచ్చుచుండుటను ద్వారమునుండి కనిపెట్టిచూచి వెంటనే లోని కరిగి శయ్యపైఁ బరుండి యామె మిథ్యానిద్ర నభినయించుచుండ నే లోనికరిగి కంచుకమును ధరించియుండు నామెశరీ మును మెల్లగ స్పర్శించినంతనే గండంబులు వికసించి పులకితములై యొప్పు చుండు నాసుందరి నిప్పుడును తలఁచుచున్నాను.

అద్యాపి తాం జఘనదర్శనలాలసేన
కృష్టం మయా నివసనాఞ్చల మేకపార్శ్వే,
పూర్వోత్థితా మపతితం ముహు రాకృషన్తీం
మన్దాక్షసంకుచితనమ్రముఖీం స్మరామి. 122

టీ. జఘన...లాలసేన - జఘన=జఘనప్రదేశముయొక్క, దర్శన= చూచుటయందు, లాలసేన=అత్యాసక్తుఁడనగు, మయా=నాచేత, ఏకపా ర్శ్వే-ఏక=ఒక, పార్శ్వే=భాగమున, కృష్టం=లాగఁబడినదియు, పూర్వో త్థితాం-పూర్వ=ముందు, ఉత్థితాం=లేచినదియు (నగు), నివసనాంచలం- నివసన=చీరయొక్క, అంచలం=చెంగును, అపతితం=పడకుండునట్లు, ము హుః=మాటిమాటికి, ఆకృషన్తీం=లాగుచున్నదియు, మందాక్ష...ముఖీం- మందాక్ష=సిగ్గుచే, సంకుచిత=ముడుచఁబడినదియు, నమ్ర = వంచినదియు, (నగు), ముఖీం=ముఖముగలిగిన, తాం=ఆమెను, అద్యాపి=ఇప్పుడును, స్మరామి=తలఁచుచున్నాను.

తా. ఆసుందరి జఘనంబును జూడ నత్యాసక్తిగలిగి నే నొకసారి యామెచీర చెఱఁగునుబట్టి లాగుటయు నయ్యది ముందుభాగమునలేచి వీడు టకు సిద్ధముకాగా సిగ్గుచే ముఖమును ముడిచి వంచి చీరపడిపోకుండునట్లు మాటిమాటికి లాగుచుండు నావిలాసవతి నిప్పుడును స్మరించుచున్నాను.

అద్యాపి తాం విలులితశ్లథకేశపాశా
మీషత్సమున్మిషితఘూర్ణితజిహ్మనేత్రామ్,

సుప్తోత్థితాం సువదనాం ముహురఙ్గభఙ్గాం
పశ్యామి దష్టమధరం బహుశః స్పృశన్తీమ్. 123

టీ. సుప్తోత్థితాం-సుప్త=నిద్రించినదియు, ఉత్థితాం=లేచినదియు, విలుళిత...పాశాం-విలుళిత=నలుగుడుచే, శ్లథ=వీడిన, కేశపాశాం=కేశసమూహము కలిగినదియు, ఈషత్...నేత్రాం-ఈషత్=కొంచెము, సమున్మిషిత=తెఱవఁబడినదియు, ఘూర్ణిత=సుడిగలిగినదియు, జిహ్మ=కుటిలములైన, నేత్రాం=నేత్రములుగలిగినదియు, సువదనాం=శోభనమగు ముఖముగలిగినదియు, ముహురఙ్గభఙ్గాం-ముహుః=పలుమారగుచున్న, అఙ్గభఙ్గాం=ఒడలివిఱుపు గలిగినదియు, దష్టం=కొఱకఁబడిన, అధరం=మోవిని, బహుశః=అనేకసారులు, స్పృశన్తీం=ముట్టిచూచుకొనుచున్నదియు (నగు), తాం=ఆమెను, అద్యాపి=ఇప్పుడును, పశ్యామి=చూచుచున్నాను.

తా. నిద్దురనుండి లేచినవెంటనే నలుగువడిన కేశభారము వీడియుండ నిద్రాలసతచే సుడివడి కొంచెముగ తెఱవంబడియుండు నేత్రములతో సుందరమగుముఖముతో నొప్పుచు మాటిమాటికి నొడలు విఱుచుకొనుచు రాత్రి కొఱకంబడిన కెమ్మోవిని తడవిచూచుకొనుచు నుండు నా సుందరిరూపవిశేషము నిప్పటికిని చూచుచున్నాను.

అద్యాపి తాం సువదనాం వలభౌ నిషణ్ణాం
తద్గేహసన్నిధిగతే మయి దృష్టమాత్రే,
నర్మోత్తరం ప్రియసఖీషు కృతస్మితాసు
లజ్జావిలాససహితాం హృది చిన్తయామి. 124

టీ. వలభౌ=మిద్దెముంగిలియందు, నిషణ్ణాం=కూర్చుండినదై, మయి=నేను, తత్...గతే-తత్=ఆమెయొక్క, గేహ=గృహముయొక్క, సన్నిధి=సమీపమును, గతే=పొందినవాఁడనై, దృష్టమాత్రే=చూడఁబడినంతనే, సువదనాం = శోభించుముఖముగలిగినదియు, నర్మోత్తరం - నర్మ = పరిహాస

వాక్యములచే, ఉత్తరం=అధికమగునట్లు, ప్రియసఖీషు=ప్రియస్నేహితురాం డ్రు, కృతస్మితాసు-కృత=చేయఁబడిన, స్మితాసు=చిరునగవుగలవారగు చుండఁగా, లజ్జా...సహితాం-లజ్జా=సిగ్గుతోడను, విలాస=విలాసముతో డను, సహితాం=కూడికొనినదియు నగు, తాం=ఆమెను, అద్యాపి=ఇప్పు డును, హృది=మనసున, చిన్తయామి=తలఁచుచున్నాను.

తా. కార్యవశంబున నేనొకసారి వెలుపలి కరిగినప్పుడు నారాక కెదురుచూచుచు మిద్దైపైనుండు ముంగిలిభాగమున నుపవిష్టయైయుండి నేను గృహముచెంతకు వచ్చుచుండుటం గనినంత నే ముఖము వికసింప సంతుష్టయై యగపడు నామెం జూచి యాంతరంగిక సఖులు పరిహాసములాడుచు నవ్వు చుండ సిగ్గుచే నొకవిధమగు విలాసమును ధరించియుండు నాసుందరి నిప్పటి కిని మనసునఁ దలంచుచున్నాను.

అద్యాపి తా మనునయ త్యపి చాటుపూర్వం
కోపాత్ పరాకృతముఖీం మయి సాపరాధే,
ఆలిఙ్గితే ప్రసభ ముత్పులకాఙ్గయష్టిం
మా మేతి దుస్సహ మి వోక్తవతీం స్మరామి. 125

టీ. (మయి=నేను), సాపరాధే=అపరాధములోకూడుకొనినవాఁడనై, చాటుపూర్వం - చాటు = ప్రియవచనములు, పూర్వం = మొదట కలుగు నట్లు, అనునయత్యపి = వేడుకొనుచున్నను, కోపాత్ = కోపమువలన, పరా...ముఖీం - పరాకృత=వెనుకభాగముగఁజేయఁబడిన, ముఖీం-ముఖ ముగలిగినదియు, ప్రసభం = బలాత్కారముగా, ఆలిఙ్గితే = ఆలింగనము చేయుటకలిగియుండఁగా, ఉత్...యష్టిం - ఉత్పులక = గగుర్పాటుకలి గిన, అంగయష్టిం = కట్టెవంటి శరీరముకలిగినదియు, దుస్సహమివ = స హించశక్యముకాకుండునట్లుగా, మామాఇతి = వద్దువద్దని, ఉక్తవతీం = చెప్పు చుండునదియు (నగు), తాం = ఆమెను, అద్యాపి = ఇప్పుడును, స్మరామి = తలఁచుచున్నాను.

తా. ఒకవిషయంబున నే నామెనుగురించి యపరాధముఁజేసి దానిని క్షమించుటకు ప్రియవచనము లాడుచు వేఁడుకొనుచున్నను కోపమువలన పరాఙ్ముఖియై నిలిచియుండ నాసమయంబున బలాత్కారముగ నే నాలింగనముఁ జేయుటయు నంతట భావోద్రేకంబున శరీరంబునఁ బులక లంకురింప సహింపఁగూడకుండునట్లు వద్దువద్దని నిషేధించుచుండు నామానవతి యప్పటిస్థితి నిప్పుడును స్మరించుచున్నాఁడను.

అద్యాపి తాం సుశయితాం క్షణవిప్రబుద్ధాం
నిద్రాలసాం హృది భజామి కృతాఙ్గభఙ్గామ్,
జృమ్భావికాసముఖమారుతగన్ధలోభ
నిర్యద్భ్రమద్భ్రమరవిభ్రమలోలనేత్రామ్. 126

టీ. సుశయితాం=బాగుగశయనించినదియు, క్షణవిప్రబుద్ధాం-క్షణ=క్షణకాలమున, విప్రబుద్ధాం=మేల్కానినదియు, నిద్రాలసాం-నిద్రా=నిద్దురచే, అలసాం = మందమైనదియు, కృతాంగభంగాం-కృత=చేయఁబడిన, అఙ్గ=అవయవములయొక్క, భఙ్గాం = విఱుపుగలిగినదియు, జృమ్భా... నేత్రాం-జృంభా=ఆవులింతలయందలి, వికాస=వికాసముచేనైన, ముఖ=ముఖముయొక్క, మారుత=వాయువుయొక్క, గన్ధ=పరిమళమునందలి, లోభ=ఆశచే, నిర్యత్=బయలువెడలుచు, భ్రమత్=తిరుగుచునుండు, భ్రమర=తుమ్మెదలయొక్క, విభ్రమ = విలాసమువలె, లోల=చంచలమైన, నేత్రాం=నేత్రములు గలిగినదియు నగు, తాం=ఆమెను, అద్యాపి=ఇప్పుడును, హృది=మనసున, భజామి=పొందుచున్నాను.

తా. ఆమె నిద్రించిలేచినక్షణమున నిద్దురబద్ధకముచే నొడలు విఱుచుకొనుచు ఆవులింపులచే బయలువెడలుచు ముఖపరిమళములయం దాసక్తిచే భ్రమరంబులుచేరి తిరుగుచుండ వానిభ్రమణము ననుసరించుచు తిరుగుచుండు కన్నులయొక్క విలాసముగలిగి యొప్పుచుండు నాసుందరి యిప్పుడును నామనసు నందియే యున్నది.

అద్యాపి తాం సమనుగమ్య మదాలసాక్షీం
కోఽయం వ దే త్యభిహితే బహుశః సఖీభిః,
ఏనం న విద్మ ఇతి విస్మిత ముల్లప న్తీ
మున్మత్తసాన్ద్రపులకాకులితాం స్మరామి. 127

టీ. మద...అక్షీం-మద=మదముచే, అలస=మందమైన, అక్షీం=కనులుగలిగినదియు, సమనుగమ్య=అనుసరించి వెళ్లి, సఖీభిః=సఖురాండ్రచే, అయం=ఈతఁడు, కః=ఎవఁడు, వద=చెప్పుము. ఇతి=అని, బహుశః=అనేకపర్యాయములు, అభిహితే=చెప్పఁబడఁగా, ఏనం=వీనిని, నవిద్మః=ఎఱుఁగము. ఇతి=అని, విస్మితం=చిరునగవుతోఁ గూడునట్లుగా, ఉల్లపన్తీం=పలుకుచున్నదియు, ఉన్మక్త...ఆకులితాం-ఉన్మక్త=తోడుగఁబడిన, సాంద్ర=దట్టమైన, పులక=గగుర్పాటుచే, ఆకులితాం=ఆకులముగలిగిన, తాం = ఆమెను, అద్యాపి=ఇప్పుడును, స్మరామి=తలఁచుచున్నాను.

తా. కామోద్రేకంబుచే మత్తతగలిగి మందమగు దృష్టిగలిగియుండు సమయమున సఖురాండ్రు ఆమె వెనుక ననుసరించి నడచుచు నీతండెవఁడో చెప్పుమని పలుమాఱు అడుగ నాతని మన మెఱుఁగ మని చిరున వ్వంకరింప ప్రత్యుత్తర మిచ్చుచుండు నాసుందరీమణి నిప్పుడును స్మరించుచున్నాను.

అద్యాపి తాం ప్రథమసంగమజాతలజ్జాం
నిధ్యాయతి వ్యతికరే మయి మన్దధీరమ్,
సీత్కారకమ్పితశిఖాతరళప్రదీప్త
కర్ణోత్పలేన లసతీం సుదతీం స్మరామి. 128

టీ. ప్రథమ...లజ్జాం-ప్రథమ=మొదటిదగు, సంగమ=సంగమమున, జాత=కలిగిన, లజ్జాం=సిగ్గుకలిగినదియు, వ్యతికరే=కలయికయందు, మయి=నేను, మన్దధీరం-మంద=మెల్లగను, ధీర=ధీరముగను, నిధ్యాయతి=చూచుచుండఁగా, సీత్కార...ఉత్పలేన-సీత్కార = సీత్కారముచే, కమ్పిత=

కదల్చఁబడిన, శిఖా=చివరలచే, తరళ=చంచలమై, ప్రదీప్త=మెఱయుచున్న, కర్ణ=చెవియందలి, ఉత్పలేన = కలువచే, లసతీం=ఒప్పుచున్నదైయుండు, తాం=ఆ, సుదతీం=మెఱుఁగుఁబోఁడిని, అద్యాపి=ఇప్పుడును, స్మరామి= తలఁచుచున్నాను.

తా. ప్రథమసంగమన కాలంబున లజ్జావతియై యుండు నామెను మెల్లఁగను ధీరముగను నేనుచూచుచుండ దాని నన్యథాకరించుటకై సీత్కారముచేయ నద్దానిచే కర్ణమునందలి కలువయొక్క యగ్రభాగంబు చలింపుచు మెఱయుచుండ మిగుల నొప్పుచుండు నాసుందరి నిప్పుడును తలఁచుచున్నాను.

అద్యాపి తాం గతినిరాకృతరాజహంసీం
ధమ్మిల్లనిర్జితమయూరకలాపభారామ్,
చక్షుః శ్రియా హసితమత్తచకోరనేత్రాం
సంచిన్తయామి కలకణ్ఠసమానకణ్ఠీమ్. 129

టీ. గతి...హంసీం-గతి = గమనముచే, నిరాకృత = నిరాకరించఁబడిన, రాజహంసీం=ఆఁడురాజహంసగలిగినదియు, ధమ్మిల్ల...భారాం-ధమ్మిల్ల=కొప్పుచే, నిర్జిత=జయించఁబడిన, మయూర=నెమిలియొక్క, కలాప=పురియొక్క, భారాం = మొత్తముకలిగినదియు, చక్షుః శ్రియా-చక్షుః= నేత్రములయొక్క, శ్రియా=శోభచేత, హసిత...నేత్రాం-హసిత=నవ్వఁబడిన, మత్త=మదించిన, చకోర=చకోరపక్షియొక్క, నేత్రాం=కనులుగలిగినదియు, కలకంఠ...కణ్ఠీం-కలకంఠ=కోకిలతో, సమాన=సమానమైన, కంఠీం=కంఠముకలిగినదియు (నగు), తాం=ఆమెను, అద్యాపి=ఇప్పుడును, సంచిన్తయామి=తలఁచుచున్నాను.

తా. రాజహంసను గూడ జయించునంతటి సుందరమగు నడకయు నెమిలిపురిం గూడ జయింపఁజాలు కేశపాశసౌందర్యంబును మత్తచకోరంబులంగూడ పరిహసింపఁజాలు నేత్రశోభయు కలకంఠకంఠంబుల కెనయగు

కంఠస్వరమును గలిగి విరాజిల్లుచుండు నాసుందరాంగి నిప్పటికిని తలఁచుచున్నాఁడను.

అద్యాపి తాం మకరకేతనవైజయన్తీ
మన్తర్ముఖే మదధరోష్ఠదళం విధాయ,
అఙ్గైః కదమ్బవికచై ర్మమ గాఢ మఙ్గ
మాలిఙ్గ్య కేళిశయనే శయితాం స్మరామి. 130

టీ. ముఖేఅన్తః=ముఖములో, మత్...దళం-మత్ = నాయొక్క, అధరోష్ఠ = అధరోష్ఠముయొక్క, దళం = భాగమును, విధాయ=ఉంచి, కదమ్బవికచైః-కదమ్బ=కడిమపూవువలె, వికచైః = వికసించిన, అఙ్గైః=అవయవములలో, మమ=నాయొక్క, అంగం=శరీరమును, గాఢం=బిగువుగ, ఆలిఙ్గ్య=కౌఁగిలించి, కేళిశయనే = కేళిశయ్యయందు, శయితాం=శయనించియుండు, తాం=ఆ, మకర...వైజయన్తీం - మకరకేతన = మన్మథుని యొక్క, వైజయన్తీం=పతాకమును, అద్యాపి=ఇప్పుడును, స్మరామి=తలఁచుచున్నాను.

తా. రాత్రిలయందు నాయధరోష్ఠంబును తననోటితో పట్టియుంచి తదానందవశంబున దేహంబంతయు వికసించియుండు తన యవయవములన్నిటిని నాశరీరంబునకుఁ బెనవైచి పట్టి యాలింగనముఁ జేసికొని కేళిశయ్యపైఁ బరుండి మన్మథునిపతాకయో యన విరాజిల్లుచుండు నాకామిని నిప్పుడును స్మరించుచున్నాను.

అద్యాపి తా ముపవనే పరిచారయుక్తాం
సంచిన్తయా మ్యుపగతాం మదనోత్సవాయ,
మాం పార్శ్వ్వసన్నిహితలోకభయాత్ సుభీతం
వ్యావర్తితేక్షణ మలం సునిరీక్షమాణామ్. 131

టీ. పరిచారయుక్తాం-పరిచార=భృత్యులతో, యుక్తాం = కూడినదై, ఉపవనే=ఉద్యానమునందు, మదనోత్సవాయ-మదన = మన్మథునియొక్క, ఉత్సవాయ=ఉత్సవముకొఱకు, ఉపగతాం = వచ్చినదియు, పార్శ్వ... భయాత్-పార్శ్వ = ప్రక్కలయందు, సన్నిహిత = సమీపించియుండు, లోక=జనులవలని, భయాత్ = భయమువలన, సుభీతం = భయపడిన, మాం=నన్ను, వ్యావర్తితేక్షణం-వ్యావర్తిత=త్రిప్పఁబడిన, ఈక్షణం=కనులు గలుగునట్లు, అలం=మిక్కిలి, సునిరీక్షమాణాం=చూచుచుండు, తాం=ఆమెను, అద్యాపి=ఇప్పుడును, సంచిన్తయామి=తలఁచుచున్నాను.

తా. ఒకసారి తాను మన్మథపూజకొఱకు భృత్యులతోఁగూడి యుద్యానంబున కరుదేర నేను నచ్చటి కరిగి పార్శ్వంబులనుండు జను లేమనుకొందురో యనుభీతిచే దూరమునుండి చూచుచుండఁ గనులం ద్రిప్పి నావైపధికముగఁ జూచుచు తనయనురాగంబును ప్రకటించుచుండు నాప్రేయసి నిప్పుడును తలంచుచున్నాను.

అద్యాపి తా మురసిజద్వయ మున్నమయ్య
నశ్యద్వళిత్రితయదర్శితరోమరాజిమ్,
ధ్యాయామి వేల్లితభుజాం విహితాఙ్గభఙ్గ
వ్యాజేన నాభికుహరం మమ దర్శయన్తీమ్. 132

టీ. ఉరసిజద్వయం = స్తనద్వయమును, ఉన్నమయ్య = ఎగచి, నశ్యత్...రాజిం-నశ్యత్=పోయిన, వళి=వళులయొక్క, త్రితయ=త్రయముగలుగునట్లు, దర్శిత=చూపఁబడిన, రోమరాజిం=నూఁగారుగలిగినదియు, వేల్లితభుజాం-వేల్లిత = విదలించఁబడిన, భుజాం = చేతులుగలదై, విహిత...వ్యాజేన-విహిత = చేయఁబడిన, అఙ్గ=ఒడలియొక్క, భఙ్గ=విఱుపులనెడి, వ్యాజేన=మిషచే, నాభికుహరం=నాభీరంధ్రమును, మమ=నాకు, దర్శయన్తీం = చూపుచున్నదియు (నగు), తాం=ఆమెను, అద్యాపి=ఇప్పుడును, ధ్యాయామి=తలఁచుచున్నాను.

తా. రహఃప్రచారకాలములయందు ఏదో కారణముచేత వలె స్తనద్వయము పైకెగయునట్లు ఱొమ్మును పైకెత్తి వళులు పోవునట్లుచేసి నూఁగారు నగపఱచుచు చేతులఁ బైకెత్తి ఒడలు విఱుచుకొనుట నభినయించుచు పొక్కిలి నగపఱచుచు నాకు భావోద్రేకము కలుగునట్లు చేయుచుండు నా మనోహారిణి నిప్పుడును తలఁచుచున్నాను.

అద్యాపి తాని మృదుమన్థరభాషితాని
తిర్యగ్వివర్తినయనాన్తనిరీక్షితాని,
లీలాలసాఞ్చితగతాని సువిస్మితాని
తస్యాః స్మరామి హృది విభ్రమచేష్టితాని. 133

టీ. మృదు...భాషితాని-మృదు = మృదువులును, మన్థర=మెల్లనివియునగు, భాషితాని = మాటలు గలిగినవియు, తిర్యక్...నిరీక్షితాని-తిర్యక్=అడ్డముగా, నివర్తి=తిరిగిన, నయన=నేత్రములయొక్క, అంత=కొనలచే నగు, నిరీక్షితాని=చూపులు గలిగినవియు, లీలా...గతాని-లీలా=విలాసముచే, అలస=మందములును, అంచిత=ఒప్పునవియు (నగు), గతాని=నడకలు గలిగినవియు, సువిస్మితాని=మంచి చిరునగవులు గలిగినవియునగు, తస్యాః=ఆమెయొక్క, తాని=ఆ, విభ్రమచేష్టితాని = విలాసవ్యాపారములను, అద్యాపి=ఇప్పుడును, హృది=హృదయమున, స్మరామి=తలఁచుచున్నాను.

తా. మృదువుగను మెల్లగను జరుపఁబడుచుండు నాసంభాషణంబులును అడ్డముగాఁ ద్రిప్పి కనుగొనలనుండి ప్రసరింపఁజేయఁబడుచుండు నా చూపులును విలాసముచే మందమై సుందరమై ప్రవర్తించుచుండు నా నడకలును ఆచిరునగవులును ఈమొదలగు నావిలాసిని విలాసవ్యాపారములన్నియు నాహృదయంబున నిప్పుడు మెలంగుచున్నవి.

అద్యాపి తాం సురతఘూర్ణితమీలితాక్షీం
ప్రస్రాఙ్గయష్టిగలితాకులకేశపాశామ్,

తన్వీం కురఙ్గనయనాం సురతైకపాత్రీం
తాం రాజహంసగమనాం మనసా స్మరామి. 134

టీ. సురత...అక్షీం - సురత=సురతముచే, ఘూర్ణిత = సుడివడినది యు, మీలిత=మూయఁబడినదియు (నగు), అక్షీం = కనులుగలిగినదియు, స్రస్త...పాశాం-స్రస్త=వీడి, అఙ్గయష్టి = కట్టెపంటిదేహమునందు, గళిత= జాఱిన, ఆకుల = వ్యాకులమైన, కేశపాశాం=కేశసమూహముగలిగినదియు, తన్వీం = సన్నమైనదియు, కురఙ్గనయనాం - కురఙ్గ = లేడియొక్క, నయ నాం=కన్నులవంటికన్నులు గలిగినదియు, సురతైకపాత్రీం - సురత=సంభో గమునకు, ఏకపాత్రీం=ముఖ్యముగ యోగ్యురాలును, రాజహంసగమనాం - రాజహంస = రాజహంసయొక్క, గమనాం = నడకవంటి నడకగలిగినదియు (నగు), తాం=అమెను, మనసా=మనస్సుచే, స్మరామి=తలఁచుచున్నాను.

తా. సురతకాలములయందు సుడవడి ముడిగియుండు కనులును శరీ రమున జారిపడి వ్యాకులములైయుండు చికురపుంజంబులును సన్నమై విల సిల్లుదేహమును లేడికన్నులవంటి కన్నులును రాజహంసగతివంటి గమనమును గలిగి సురతంబున కామెయే తగినదని చెప్పనొప్పు నాసుందరాంగి. నిప్పుడు మనసునఁ దలంచుచున్నాఁడను.

అద్యాపి తా మలసమీలితచారునేత్రాం
లోలద్భుజావలయకన్ధర మావహన్తీమ్,
వల్గత్కపోలభుజ మున్నమితభ్రు కర్ణే
కణ్డూయనం విదధతీం హృది చిన్తయామి. 135

టీ. అలస...నేత్రాం-అలస = బద్ధకముచే, మీలిత = మూయఁబడి, చారు=సుందరమైన, నేత్రాం = కనులుగలిగినదియు, లోలత్...కన్ధరం - లోలత్=చలించుచున్న, భుజా=భుజముయొక్క, వలయ = వలయమును, కన్ధరం=మెడను,ఆవహన్తీం=వహించుచున్నదియు, వల్గత్...భుజం- వల్గత్= కదలుచున్న, కపోల=చెక్కిలియు, భుజ = భుజమును కలుగునట్లును, ఉన్న

మితభ్రు- ఉన్నమిత=వంచఁబడిన, భ్రు=కనుబొమలు కలుగునట్లును, కర్ణే=చెవియందు, కణ్డూయనం=గోకుటను, విదధతీం=చేయుచుండు, తాం=ఆసుందరిని, హృది=మనసున, అద్యాపి=ఇప్పుడును, చిన్తయామి=తలఁచుచున్నాను.

తా. సుఖానుభవ విశేషంబుచే మందములై ముకుళితములై నేత్రములు సుందరములై యొప్పుచుండ చేతికంకణములును మెడయు కదలుచుండ చెక్కిళ్లను భుజమును గదుపుచు కనుబొమలముడిచి చెవియందలి దురద నపనయనము చేయుచుండు నాసుందరిస్థితి నిప్పటికిని మనసునఁ దలఁచుచున్నాను.

అద్యాపి తా మవహితో మనసాఽచలేన
సంచిన్తయామి రమణీం మమ జీవితేశామ్,
నాన్యోపభుక్తనవయౌవనభారసారాం
జన్మాన్తరేఽపి న మయా వియుతి ర్యథా స్యాత్. 136

టీ. నాన్య...సారాం - నాన్యోపభుక్త=ఇతరులచే ననుభవింపఁబడని, నవ=నూతనమగు, యౌవనభార = యౌవనాధిక్యముయొక్క, సారాం=సారముగలిగినదియు, మమ = నాయొక్క, జీవితేశాం = ప్రాణనాయకియగు, తాం=ఆ, రమణీం=సుందరిని, జన్మాంతరేఽపి=మఱియొక జన్మమునందును, మయా=నాతో, వియుతిః=వియోగము,యథా=ఎట్లు, నస్యాత్=కలుగదో, తథా=అట్లు, అవహితః=సావధానుఁడనై, అచలేన=నిశ్చలమగు, మనసా=మనసుతో, సంచిన్తయామి=తలఁచుచున్నాను.

తా. నూతనముగ యౌవన ముదయమునందినప్పటినుండియు నాయందే యనురాగముగలిగి నాచేత ననుభవింపఁబడుచు నాజీవితమున కాధారభూతురాలై యుండు నాసుందరిని రాఁబోవు జన్మములయందును స్మృతి నందుచు వియోగము కలుగకుండునట్లు ఇప్పు డీమరణసమయమున అవహితమై నిశ్చలమై యుండు మనసుతో స్మరణము నాచరించెదను.

అద్యాపి తత్ ప్రణయభఙ్గురదృష్టిపాతం
తస్యాః స్మరామి రతివిభ్రమపత్త్రభఙ్గమ్,
వక్త్రం కరస్థగితచారుపయోధరం చ
దన్తచ్ఛదం దశనమణ్డలఖణ్డితం చ. 137

టీ. ప్రణయ...పాతం-ప్రణయ=ప్రేమచే, భఙ్గుర=భంగశీలమగు, దృష్టి=దృష్టియొక్క, పాతం = ప్రసారము కలిగినదియు, రతి...భఙ్గం-రతి=క్రీడయందలి, విభ్రమ=విలాసములచేనైన, పత్త్ర=మకరికాదిపత్త్రముల యొక్క, భఙ్గం=భంగము కలిగినదియు (నగు) తస్యాః = ఆమెయొక్క, తత్ = ఆ, వక్త్రం=ముఖమును, కర...పయోధరం చ - కర = చేతులచే, స్థగిత=మూయఁబడిన, చారు = మనోహరమగు, పయోధరంచ=స్తనములను, దశన...ఖండితం - దశనమండల=పలువరుసచే, ఖండితం = కొఱుకఁబడిన, దన్తచ్ఛదంచ = కెమ్మోవిని, అద్యాపి = ఇప్పుడును, స్మరామి = తలఁచుచున్నాను.

తా. క్రీడాకాలంబులయందు ప్రేమాపూర్ణంబులై భంగశీలంబులై యొప్పుచుండు దృష్టిప్రసారంబులు గలిగి క్రీడాలాపంబులచే స్తనముఖాదులయందు రచింపఁబడియుండు మకరికాపత్త్రాది నిర్మాణము లన్నియు వీడిపోయియుండు నాసుందరి ముఖసౌందర్యమును చేతులచేఁ గప్పఁబడియుండు కుచంబులను పండ్లచేఁ గొఱుకఁబడి విరాజిల్లుచుండు మోవిని ఇప్పుడును తలంచుచున్నాను.

అద్యాపి తాం గళితబన్ధనకేశపాశ
స్రస్తస్రజం స్మితముఖీం వరకమ్బుకణ్ఠీమ్,
పీనోన్నతస్తనయుగోపరి చారుచఞ్చ
న్ముక్తావళిం సురతతాన్తముఖీం స్మరామి. 138

టీ. గళిత...స్రజం - గళిత = వీడిన, బన్ధన=ముడిగల, కేశపాశ = కేశసమూహమునుండి, స్రస్త=జారిన, స్రజం = పూలమాలలు కలిగినదియు, స్మితముఖీం -స్మిత=చిరునగవుతోఁగూడిన, ముఖీం=ముఖము గలిగినదియు, వర...కంఠీం-వర=శ్రేష్ఠమై, కంబు=శంఖమువంటి, కంఠీం=కంఠము గలిగినదియు, పీన...ఆవళిం-పీన = బలిసి, ఉన్నత = ఎత్తైన, స్తనయుగ=చనుఁగవయొక్క, ఉపరి=పైభాగమున, చారు = మనోహరముగ, చంచత్=ఒప్పుచుండు, ముక్తావళిం=ముత్తెపుసరులు గలిగినదియు, సురత...ముఖీం-సురత=రతిచే, తాంత=వాడిన, ముఖీం=ముఖము కలిగినదియు (నగు), తాం=ఆమెను, అద్యాపి=ఇప్పుడును, స్మరామి=తలఁచుచున్నాను.

తా. రత్యంతకాలంబున సురతశ్రమచే ముఖము వాడి తలముడి వీడి పూవులు జార బలిసి నిక్కియుండు చనులపై సవరింపఁబడిన ముత్తెపుసరులొప్పగ నలరారుచుండ సుందరమై శంఖమువలె నుండు కంఠము నెత్తి చిరునగవులో నొప్పెడు నాసుందరి నిప్పుడును తలంచుచున్నాఁడను.

అద్యాపి తాం సురతజాగరఘూర్ణమాన
తిర్యగ్వివృత్తతరళాయతతారకాక్షీమ్,
శృఙ్గారసారకమలాకరరాజహంసీం
వ్రీడావినమ్రవదనాం మనసా స్మరామి. 139

టీ. సురత...అక్షీం - సురత=రతిచేనైన, జాగర=నిద్రలేమిచే, ఘూర్ణమాన=సుడియుచు, తిర్యక్= అడ్డముగా, వివృత్త=త్రిప్పఁబడి, తరళ = చంచలములై, ఆయత=విశాలములైన, తారక=కనీనికలుగల, అక్షీం=కనులు గలిగినదియు, శృంగార...హంసీం - శృంగార = శృంగారమనెడు,సార= సారపదార్థముగల, కమలాకర = సరస్సునందలి, రాజహంసీం = రాజహంసయైనదియు, వ్రీడా...వదనాం-వ్రీడా=సిగ్గుచే, వినమ్ర=వంగిన, వదనాం= ముఖము కలిగినదియు (నగు),తాం=ఆమెను, అద్యాపి=ఇప్పుడును, మనసా= మనస్సుచే, స్మరామి=తలఁచుచున్నాను.

తా. సురతంబుచేఁ గలుగు జాగరణవశంబునఁ గనులు సడిసి విశాల ములగు తారకలు అడ్డముగఁ జంచలములై తిరుగుచుండ సిగ్గుచేఁ దలవంచి శృంగార సర్వసారంబున కలంకార భూతయై యొప్పుచుండు నాసుందరి నిప్పుడును మనసుచే స్మరించుచున్నాను.

అద్యాపి తాం సురతతాణ్డవసూత్రధారీం
పూర్ణేన్దుసున్దరముఖీం మదవిహ్వలాఙ్గీమ్,
తన్వీం విశాలనయనాం స్తనభారఖిన్నాం
వ్యాలోలనీవివసనాం మనసా స్మరామి. 140

టీ. సురత...సూత్రధారీం-సురత=రతియనెడు, తాండవ=నాట్య మునకు, సూత్రధారీం=సూత్రధారిణియు, పూర్ణ...ముఖీం-పూర్ణ=పూర్ణుఁ డైన, ఇందు=చంద్రునివలె, సుందర=సుందరమైన, ముఖీం=ముఖముగలిగినది యు, మద...అంగీం-మద=మదముచే, విహ్వల=పరశమైన,అంగీం=అవయవ ములు గలిగినదియు, తన్వీం=సన్నమైనదియు, విశాలనయనాం-విశాల=విశాల ములైన, నయనాం=కన్నులు గలిగినదియు, స్తన...ఖిన్నాం-స్తన=చనుల యొక్క, భార = బరువుచే, ఖిన్నాం = అలసినదియు, వ్యాలోల...వస నాం-వ్యాలోల = చంచలమైన, నీవి=పోఁకముడిగల, వసనాం = చీరగలిగి నదియు (నైన), తాం=ఆమెను, అద్యాపి=ఇప్పుడును, మనసా=మనస్సు తో, స్మరామి=తలఁచుచున్నాను.

తా. సురత వ్యాపారంబులయందు నాట్యంబులయందు సూత్ర ధారుండునుంబోలె ప్రథమప్రవృత్తి గలిగియుండునదియు పూర్ణచంద్రుండు నుంబోలె నాహ్లాదజనకంబగు ముఖంబును కామమదంబున వివశంబు లగు నంగంబులును సూక్ష్మంబగు దేహంబును గొప్పకనులును పృథువులగు కుచం బులును చంచలమగు వసనగ్రంథియుగలిగి యొప్పునదియు నగు నాసుందరి నిప్పుడును స్మరించుదును.

అద్యాపి మద్ధృదయపఙ్కజలీనభృఙ్గ్యౌ
మూర్ఛావిగర్హితవిలోచనయా మృగాక్ష్యాః,

 

వేధాః కరోతు కృపయా జననాన్తరేఽపి
సంత్యక్తమన్యు రవిరోధ మితి స్మరామి. 141

టీ. మత్...భృంగ్యా-మత్ = నాయొక్క, హృదయ=హృదయ మనెడు, పంకజ=పద్మమున, లీన=అణఁగియుండెడు, భృంగ్యా=తుమ్మెద యైనదియు, మూర్ఛా...విలోచనయా-మూర్ఛా = మూర్ఛచే, విగర్హిత= నిర్వ్యాపారములగు, విలోచనయా=కనులుగలిగినదియు, మృగాక్ష్యా=లేడి కన్నులవంటి కనులుగలిగినదియు (నగు నాసుందరితో), జననాంతరేపి= ఇతర జన్మములయందైనను, అవిరోధం = విరోధము కలుగకుండుటను, కృపయా=దయచే, సన్త్యక్తమన్యుః - సంత్యక్త=విడువఁబడిన, మన్యుః= కోపముగలవాఁడై, వేధాః=బ్రహ్మ, కరోతు=చేయుఁగాక. ఇతి=ఇట్లు, అద్యాపి=ఇప్పుడును, స్మరామి=తలఁచుచున్నాను.

తా. బ్రహ్మ కోపంబును వీడి దయగలవాఁడై నాహృదయంబున నెప్పుడు నణఁగియుండునదియు, నాయాపదను వినుటచేఁ గలిగిన మూర్ఛచే వ్యాపారంబు లుడిగిన కనులుగలిగినదియు సుందరమగు కనులుగలిగిన యా కామినీమణితో ఎప్పుడును వియోగముకలుగక సుఖము లనుభవింపఁగలుగు భాగ్యము రాఁబోవు జన్మములయందైనను కలుగునట్లనుగ్రహించుఁగాక యని ఇప్పుడు స్మరించుచున్నాను.

అద్యాపి తాం స్మితముఖీం చ మ మాజ్ఞలగ్నాం
ప్రౌఢప్రతాపమదనానలతప్తగాత్రీమ్,
బాలాం తదాత్వవివశా మనుకమ్పనీయాం
ప్రాణా దపి ప్రియతమాం మనసా స్మరామి. 142

టీ. ప్రౌఢ...గాత్రీం-ప్రౌఢ = అధికమైన, ప్రతాప = తాపము గల, మదన=మన్మథునియొక్క, అనల=అగ్నిచే, తప్త=తపింపఁజేయఁబడిన, గాత్రీం = శరీరము కలిగినదియు, స్మితముఖీం - స్మిత = చిఱునగవుతోఁ

గూడిన, ముఖీం=ముఖముగలిగినదియు, మమ=నాయొక్క, అంగలగ్నాం-అంగ=అవయవములయందు, లగ్నాం = తగుల్కొనినదియు, తదాత్వవివశాం-తదాత్వ = అప్పటికాలమున, వివశాం=పరవశురాలైనదియు, అనుకమ్పనీయాం=దయనీయురాలైనదియు, ప్రాణాదపి=ప్రాణముల కంటెను, ప్రియతమాం=మిగుల ప్రేమ పాత్రమైనదియు (నగు), తాం=ఆ, బాలాం=యువతిని, అద్యాపి=ఇప్పుడును, మనసా=మనసుతో, స్మరామి=తలంచుచున్నాను.

తా. అపరిమితంబై ప్రవర్తించుచుండు కామతాపంబున మిగులవాడి నా దేహంబున వ్రాలి చిరునగవుతో పరవశురాలై యుండునదియు అట్టి స్థితి యందుండెడు నాతరుణిం గనినంతనే ప్రాణంబులయందు కంటె నధికమగు ప్రేమను దయను తనయం దుద్భవించునట్లు చేయుచుండునదియు నగు నా యువతి నిప్పుడును తలంచుచున్నాను.

అద్యాపి తాం న న న నే త్యుదితం మదీయం
శ్రుత్వైవ భీతహరిణీ మివ చఞ్చలాక్షీమ్,
వామస్ఖలద్విసరదశ్రుజలాయతాక్షీం
తాం చిన్తయామి సురతే వినియుక్తగాత్రీమ్. 143

టీ. సురతే=రతియందు, వినియుక్తగాత్రీం-వినియుక్త=ఉపయోగింపఁబడిన, గాత్రీం=అవయవములుగలిగినదియు, నననసేతి=వలదువల దనెడి, మదీయం=నా సంబంధమగు, ఉదితం=వాక్కును, శ్రుత్వైవ=వినినయంతనే, భీతహరిణీ మివ-భీత=భయపడిన, హరిణీమివ=లేడివలె, చంచలాక్షీం-చంచల=కదలుచుండెడు, అక్షీం=కనులుగలిగినదియు, వామ...అక్షీం-వామ=సుందరముగ, స్ఖలత్=జారుచుండు, విసరత్=వ్యాపించుచున్న, అశ్రుజల=కన్నీరుగల, ఆయత=విశాలమైన, అక్షీం=కనులు గలిగినదియు (నగు), తాం=ఆమెను, అద్యాపి=ఇప్పుడును, చిన్తయామి = తలఁచుచున్నాను.

తా. ఆమె సురతంబున కున్ముఖియై యుండు కాలంబున నొక్కొక సారి నేను వద్దు వద్దని నిషేధింప నేమి కలిగినదియో యనుభయంబు మనంబున నావేశింప భీతకురంగిణింబోలు చంచలములగు నేత్రములనుండి కన్నీరు సుందరముగ జారుచు వ్యాపించుచుండఁ జూచుచుండు నాభీరువు నిప్పుడును స్మరించుచున్నాను.

అద్యాపి తద్వదనపఙ్కజగన్ధలోభ
భ్రామ్యద్ద్విరేఫచయచుమ్బనఝఙ్కృతేషు,
క్లేశావధూతకరపల్లవకఙ్కణానాం
క్వాణం చ సంప్రతి కలం హృది చిన్తయామి. 144

టీ. తత్...ఝంకృతేషు-తత్=ఆమెయొక్క, వదనపంకజ=ముఖమనెడి కమలమునందు, గంధ=పరిమళమునందలి, లోభ=ఆశచే, భ్రామ్యత్=తిరుగుచుండెడి, ద్విరేఫచయ = తుమ్మెదగుంపుయొక్క, చుంబన=చుంబనమునందును, ఝంకృతేషు=ఝుంకారములయందును(గల), క్లేశ...కంకణానాం-క్లేశ=బాధచే, అవధూత=కదల్పఁబడిన, కరపల్లవ=చిగురువంటిచేయియొక్క, కంకణానాం=కంకణములయొక్క, కలం=మనోహరమైన, క్వాణం=ధ్వనిని, సంప్రతిచ=ఇప్పుడును, హృది=మనసున, చిన్తయామి=తలఁచుచున్నాను.

తా. ఆ పద్మగంధిముఖగంధము నందలి యాశచే తుమ్మెదలు రేగి తిరుగునపుడు వానిముఖ స్పర్శమును ఝుంకారమును సహింపఁజాలక వానిని తోలుటకై కదల్పఁబడుచుండు చేతియొక్క కంకణముల మధురమైన ధ్వని నిప్పుడును తలంచుచున్నాను.

అద్యాపి నోజ్ఝతి హరః కిల కాలకూటం
కూర్మో బిభర్తి ధరణీం ఖలు పృష్ఠభాగే,
అమ్భోనిధి ర్వహతి దుస్సహబాడబాగ్ని
మఙ్గీకృతం సుకృతినః పరిపాలయన్తి. 145

టీ. హరః=శివుఁడు, కాలకూటకం=హాలాహల విషమును, అద్యాపి=ఇప్పుడును, నోజ్ఝతికిల=విడువఁడుగదా, కూర్మః=ఆదికూర్మము, పృష్ఠభాగే=వీఁపునందు, ధరణీం=భూమిని, బిభర్తిఖలు=వహించియున్నాఁడుగదా, అంభోనిధిః = సముద్రుఁడు, దుస్సహబాడబాగ్నిం - దుస్సహ = సహింపశక్యముకాని, బాడబాగ్నిం = బడబానలమును, వహతి = వహించి యున్నాఁడు. సుకృతినః=పుణ్యాత్ములు, అంగీకృతం=అంగీకరింపఁబడిన విషయమును, పరిపాలయన్తి=నెఱవేర్తురు.

తా. శివుఁడు తానంగీకరించిన విషవహనమును గూడ నిప్పటికిని విడువనట్లును ఆదికూర్మము తా నంగీకరించిన ధరణీభారవహనము కష్టమైనను ఇప్పటికిని చేయుచుండునట్లును సముద్రుఁడు తా నంగీకరించిన బడబానలధారణమును సహింప శక్యము కాకపోయినను యిప్పటికిని సహించియుండునట్లును పుణ్యకర్ములు తా మంగీకరించిన కృత్యంబులను నిర్వర్తించుచునే యుందురు. కావున నో రాజా! నీ వంగీకరించిన కృత్యమును నీవు నిర్వర్తింపుము. నే నంగీకరించిన యామినీపూర్ణతిలకయందలి మోహమును నేను విడువఁజాలను.

పఞ్చత్వం తను రేతు భూతనివహే
స్వాంశా మిళన్తు ధ్రువం
ధాత స్త్వాం ప్రణిపత్య సాదర మిదం
యాచే నిబద్ధాఞ్జలిః,
తద్వాపీషు పయ స్తదీయముకురే
జ్యోతి స్తదీయాఙ్గణే
వ్యోమ స్యాచ్ఛ తదీయవర్త్మని ధరా
తత్తాళవృన్తేఽనిలః. 146

టీ. తనుః=శరీరము, పంచత్వం=మృతిని, ఏతు=పొందుఁగాక. భూతనివహే - భూత = పంచభూతములయొక్క, నివహే = సమూహమును,

స్వాంశాః=తమభాగములు, ధ్రువం=నిశ్చయముగా, మిళన్తు=కలియుఁగాక. హేధాతః=ఓబ్రహ్మా, నిబద్ధాఞ్జలిః-నిబద్ధ=కట్టఁబడిన, అంజలిః = దోసిలి గలవాఁడనై, ప్రణిపత్య=నమస్కరించి, సాదరం = ఆదరముతోఁగూడ, త్వాం=నిన్ను, ఇదం=దీనిని, యాచే=అడుగుచున్నాను. తద్వాపీషు-తత్= ఆసుందరియొక్క, వాపీషు=దిగుడు బావులయందు, పయః=జలమును, తదీయముకురే-తదీయ=ఆతన్విసంబంధమగు, ముకురే=అద్దమునందు, జ్యోతిః= తేజస్సును, తదీయాంగణే-తదీయ=ఆమెకుసంబంధించిన, అంగణే=ముంగి టియందు, వ్యోమ=ఆకాశంబును, తదీయవర్త్మని-తదీయ = ఆమెసంబంధ మగు, వర్త్మని=మార్గమున, ధరా = భూమియు, తత్తాళవృంతే-తత్ =ఆమె యొక్క, తాళవృంతే=విసనకఱ్ఱయందు, అనిలః=వాయువును, మిళంతు= కలియునుగాక.

తా. నాదేహము మృతినందుఁగాక. అట్టిసందర్భమున నాదేహమునకుఁ జేరిన పృథివ్యాది పంచభూతంబుల భాగంబులును వానివానికి చేరుగాక. ఓబ్రహ్మా! అట్లుచేరుటలో నొకవిధమగు నియమమునుసూత్ర మనుసరింపవల యునని సాంజలిబద్ధుఁడనై నమస్కరించి నిన్ను అడుగుచున్నాను. ఆనియమ మెద్దియన? పంచభూతంబులలో నాదేహభాగంబులు చేరునపుడు స్వేచ్ఛగ నేదే నొకచోటచేరక నాదేహంబునందలిజలభాగ మాయువతి జలకంబు లాడుభావులయందు చేరుగాక. తేజోభాగ మాసుందరి తనసుందరవదనార విందమును వీక్షించుముకురంబున సంక్రమించుఁగాక. ఆకాశభాగ మాతరుణి విహరించుముంగిలి ప్రదేశములయందు వ్యాపించుఁగాక. పృథివీభాగ మామంద గమన సంచరించు మార్గములయందుఁ గలియుగాక. వాయు వాసుకుమారిణి వీచుకొనువ్యజనంబునం దావహిల్లుంగాక. ఇట్టి నియమముమాత్ర మనుసరింపఁ బడుటకు నిన్నాదరాతిశయమున నడుగుచున్నాను.

ఇత్యేవంవర్ణినం ప్రాజ్ఞం కవిం దృష్ట్వా నతాననాః,
తూర్ణం గత్వా నరేశం త మూచుః సర్వేఽపి సాదరమ్.

టీ. ఇత్యేవం = ఈచెప్పఁబడినచొప్పున, వర్ణినం = వర్ణించుచుండు, ప్రాజ్ఞం=విద్వాంసుఁడైన, కవిం=కవిని, దృష్ట్వా=చూచి, సర్వే=అందరును; నతాననాః-నత=వంచఁబడిన, ఆననాః=ముఖములు గలవారలై, తూర్ణం=శీఘ్రముగా, గత్వా=పోయి, నరేశం=రాజునుఁగూర్చి, సాదరం=ఆదరముతో కూడునట్లుగా, ఊచుః=చెప్పిరి.

తా. ఇట్లు చెప్పఁబడినచొప్పున యామినీతిలకకును తనకు నుగలసంబంధ విశేషంబులును పరస్పరప్రేమానుబంధంబులును వృత్తప్రక్రియలును సుఖాసుఖపంబులును వర్ణించుచుండు నాకవిశ్రేష్ఠుని తిలకించి అధికారు లంపరుసద్దానిని వినలేక దుఃఖముచేఁ దలలవంచి పరస్పరమును దృఢముగఁ బ్రేమించియుండువారలను వియోగము నందించ నిష్టములేక రాజునొద్దకు శీఘ్రముగనరిగి వృత్తాంతమునంతయుఁ జెప్పి చెప్పఁబోవు తెఱంగున ఆదరముతో మనవిచేసిరి.

ప్రసాదయ కవీన్ద్రం తం సందర్శయ చ కౌతుకమ్,
శ్రుత్వా వాక్యం నృప స్తేషాం కవి మానాయయ ద్ద్రుతమ్.

టీ. తం=ఆ,కవీన్ద్రం=కవిశ్రేష్ఠుని, ప్రసాదయ=ఆసన్నునిగాఁజేయుము, కౌతుకం=ఉత్సాహమును, సందర్శయ=చూపుము. నృపః=రాజు, తేషాం=వారియొక్క, వాక్యం=వాక్యమును, శ్రుత్వా=విని, ద్రుతం=శీఘ్రముగ, కవిం=బిల్హణకవిని, ఆనాయయత్=పిలిపించెను.

తా. "ఓరాజా! వారికలయిక న్యాయమైనదియు యుక్తమైనదియునగుటచే నీ వుత్సాహముగలవాఁడవై కవియందు ప్రసన్నుఁడవై వానిని ప్రసన్నునిగఁజేయుము" అని చెప్పిన వారలవాక్యముల నాలించి యంగీకరించి వెంటనే బిల్హణకవిని అచ్చటనుండి రప్పించెను.

పరిరభ్య కవిం తస్మై వహ్నిసాక్షి నిజాత్మజామ్,
సంప్రదాయ వివాహం చ కారయామాస భూపతిః. 149

టీ. భూపతిః=రాజు,కవిం=కవిని, పరిరభ్య=కవుఁగిలించుకొని, తస్మై=వానికొఱకు, నిజాత్మజాం-నిజ=తన, ఆత్మజాం=కొమరితెను, సంప్రదాయ=ఇచ్చి, అగ్నిసాక్షి=అగ్నిసాక్షిగఁ గలుగునట్లు, వివాహంచ=వివాహమునున్ను, కారయామాస=చేయించెను.

తా. అట్లు కవిని రప్పించి వానినాలింగనాదులచే ప్రసన్నునింజేసి తన కొమరితెయగు యామినీపూర్ణతిలక నాయనకు నగ్నిసాక్షికముగ కన్యాదానముచేసి వివాహవిధుల యథోక్తరీతిని జరిపించెను.

పూర్వార్ధ ఏవ తద్రాత్రౌ రన్తుకామం పతిం ప్రతి,
ఉవాచ కామసంతప్తం రాజపుత్రీ ప్రమోదతః. 150

టీ. తద్రాత్రౌ-తత్=ఆ, రాత్రౌ=రాత్రియందు, పూర్వార్ధ ఏవ-పూర్వ=మొదటిదగు, అర్ధఏవ=సగమునందే, రంతుకామం = రమింపఁగోరికగలిగి, కామసంతప్తం-కామ=కామముచే, సంతప్తం=తపింపఁజేయఁబడియుండు, పతింప్రతి=భర్తనుగూర్చి, రాజపుత్రీ=రాజపుత్రిక, ప్రమోదతః=సంతోషమువలన, ఉవాచ=పలికెను.

తా. తమకు కలుగవలసిన మహత్తర వియోగము విడివడి తిరిగి కలయిక గలుగుటచే కామ మగ్గలమై యాకవివరేణ్యుఁడు పూర్వరాత్రముననే యాసుందరిం గవయ నుంకింప విదుషీమణియగు నారాజపుత్రి సంతుష్టస్వాంతయై ఇట్లు పలికెను.

జాగర్తి లోకో జ్వలతి ప్రదీపః
సఖీజనః పశ్యతి కౌతుకేన,
ముహూర్తమాత్రం కురు కాన్త ధైర్యం
బుభుక్షితః కిం ద్వికరేణ భుఙ్క్తే? 151

టీ. హేకాంత=ఓప్రియుఁడా! లోకః=జనము, జాగర్తి=మేలుకొనియున్నది. ప్రదీపః=దీపము, జ్వలతి=వెలుఁగుచున్నది. సఖీజనః = సఖీసమూహము, కౌతుకేన=ఉత్సాహముతో, పశ్యతి = చూచుచున్నది. ముహూర్త

మాత్రం = ముహూర్తకాలముమాత్రము, ధైర్యం = ధైర్యమును, కురు= చేయుము. బుభుక్షితః=ఆఁకలిఁగొన్నవాఁడు, ద్వికరేణ=రెండుచేతులతో, భుక్త్వేకిమ్=భుజించునా! ఏమి?

తా. జనులందరు మేల్కొనియున్నారు. దీప మింకను వెలుఁగుచునే యున్నది. ప్రియసఖులందరు నేమిజరుగునో యను నుత్సాహముతోఁ జూచుచున్నారు. కావున నో ప్రియుఁడా! ఎంతటియాఁకలిం గొనియున్నను రెండుచేతులతోడను భుజింపనట్లు తొందరపడక ఒకముహూర్తకాలముమాత్రము ధైర్యము గలిగి యోపికపట్టుము.

తతః సరాజా తనయా కవిశ్చ లక్ష్మీనివాసే నగరేనితాన్తమ్,
సుఖేన రాజ్యం పరిపాలయన్తోలక్ష్మీపతే ర్దివ్యదృశా ననన్దుః.

టీ. తతః=పిమ్మట, సః=ఆ, రాజా=రాజును, తనయా=కొమరితెయు, కవిశ్చ=కవియును, లక్ష్మీనివాసే - లక్ష్మీ=సిరికి, నివాసే=నివాసమైయుండు, నగరీ=నగరమున, నితాంతం=మిగుల, సుఖేన=సుఖములో, రాజ్యం=రాజ్యమును, పరిపాలయన్తః=పాలించుచున్నవారలై, లక్ష్మీపతేః= శ్రీమన్నారాయణునియొక్క, దివ్యదృశా-దివ్య=దివ్యమగు, దృశా=దృష్టిచే, ననన్దుః=సంతోషించిరి.

తా. ఇట్లీకథజరిగిన యనంతర మారాజును రాజపుత్రియగు యామినీపూర్ణతిలకయు కవిశ్రేష్ఠుండగు బిల్హణుండును సిరులకాటపట్టై వెలయుచుండు నాపట్టణంబున సుఖముతో రాజ్యపాలనము నాచరింపుచు శ్రీమన్నారాయణుని దివ్యకృపాకటాక్షప్రసాదంబున సంతుష్టచిత్తులైయుండిరి.

బిల్హణచరిత్రము సంపూర్ణము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1925.

# సంస్కృతగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| కార్తీకమాహాత్మ్యము, చక్కనికూర్పు ... | 0 | 6 |
| బాలరామాయణము, సటీక ... | 0 | 2 |
| పద్మపురాణాంతర్గతమాఘపురాణము, ఆంధ్రతాత్పర్యసహితము | 2 | 0 |
| శ్రీమద్రామాయణము, సుందరకాండము, మూలముమాత్రము | 1 | 0 |
| డిటో ఉత్తరకాండము, మేలుప్రతి ... | 1 | 4 |
| శ్రీమద్రామాయణము వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము, 2 సంపుటములు | 15 | 0 |
| డిటో బాలకాండము తాత్పర్యసహితము ... | 2 | 0 |
| డిటో అయోధ్యాకాండము ,, ... | 3 | 0 |
| డిటో ఆరణ్యకాండము ,, ... | 2 | 0 |
| డిటో కిష్కింధాకాండము ,, ... | 2 | 8 |
| డిటో సుందరకాండము ,, ... | 2 | 0 |
| డిటో యుద్ధకాండము ,, ... | 4 | 0 |
| డిటో ఉత్తరకాండము ,, ... | 2 | 8 |
| అమావాస్యతర్పణము ... | 0 | 1 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు ... | 0 | 3 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము ... | 0 | 2 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము ... | 2 | 0 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము ... | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక ... | 0 | 2 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) ... | 0 | 2 |
| దేవతార్చన, చిన్నసైజు ... | 0 | 1 |
| పంచసూక్తములు, సస్వరము ... | 0 | 2 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము ... | 0 | 12 |
| ,, ,, బ్రహ్మమేధసహితము ... | 0 | 4 |
| పితృతర్పణము, చిన్నసైజు ... | 0 | 1 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము ... | 0 | 2 |
| మహాన్యాసము, చిన్నసైజు ... | 0 | 6 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| మంత్రప్రశ్నములు, సస్వరము | ... | 0 | 6 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 1 |
| యజుర్వేదము, ఆరణ్యకము, సస్వరము | ... | 3 | 0 |
| యజ్ఞోపవీతధారణవిధి | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనము | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనము పురుషసూక్తము, శ్రీసూక్తము ఆంధ్రటీకాసహితము | ... | 0 | 4 |
| యజుర్వేద ఆబ్దికమంత్రములు | ... | 0 | 6 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము | ... | 2 | 0 |
| రుద్రము, పురుషసూక్తమువగైరాలు | ... | 0 | 2 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము | ... | 0 | 4 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము | ... | 0 | 8 |
| ,, ద్వితీయభాగము | ... | 1 | 0 |
| వ్రతచూడామణి, 360 వ్రతములు | ... | 2 | 0 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | ... | 0 | 1 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము | ... | 0 | 12 |
| కాలామృతము, సటీక, మేలుప్రతి | ... | 1 | 0 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు | ... | 0 | 2 |
| జలార్గళశాస్త్రము, సటీక | ... | 0 | 4 |
| ముహూర్తదర్పణము, సటీక | ... | 0 | 12 |
| నక్షత్రచూడామణి, చక్కనిప్రతి | ... | 0 | 6 |
| సర్వార్థచింతామణి, చక్కనిప్రతి | ... | 0 | 12 |
| లఘుజాతకము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |
| భృగుసూత్రములు ,, | ... | 0 | 6 |
| భావార్థచంద్రిక ,, | ... | 0 | 8 |
| వృద్ధపరాశరము ,, | ... | 0 | 10 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కేరళప్రశ్నము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 3 |
| సనత్కుమారగృహవాస్తువు,, | ... | 0 | 3 |
| మయవాస్తువు ,, | ... | 0 | 3 |
| వాస్తుసర్వస్వము ,, | ... | 0 | 4 |
| వనమాల (వర్షఫణి) ,, | ... | 0 | 3 |
| స్వప్నశాస్త్రము ,, | ... | 0 | 3 |
| సాముద్రికశాస్త్రము, సటీక | ... | 0 | 4 |
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| శకునశాస్త్రము, (శిఖినరసింహశతకము) | ... | 0 | 4 |
| సారావళి, సాంధ్రతాత్పర్యము | ... | 3 | 0 |
| ఆపస్తంబప్రవరకాండము, సటీక | ... | 0 | 3 |
| ఆశ్వలాయనప్రవరకాండము ,, | ... | 0 | 2 |
| ఆశౌచనిర్ణయము (తెనుఁగు) | ... | 0 | 3 |
| దేవలస్మృతి, సాంధ్రటీక | ... | 0 | 3 |
| పరాశరస్మృతి ,, | ... | 0 | 12 |
| బుధస్మృతి, సాంధ్ర-తాత్పర్యము | ... | 0 | 2 |
| బృహస్పతిస్మృతి ,, | ... | 0 | 3 |
| వృద్ధపరాశరస్మృతి ,, | ... | 0 | 2 |
| శంఖలిఖితస్మృతి ,, | ... | 0 | 2 |
| అపరోక్షానుభూతి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| అద్వైతపంచరత్నములు ,, | ... | 0 | 2 |
| అద్వైతోపదేశపంచరత్నములు | ... | 0 | 2 |
| అద్వైతానుభూతి ,, | ... | 0 | 2 |
| ఆత్మబోధము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 4 |
| ఆత్మపూజ, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 1 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆత్మవిద్యావిలాసము, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ... | 0 | 4 |
| ఉత్తరగీత, సటీక, చిన్నసైజు ... | 0 | 12 |
| పంచదశప్రకరణము, సవ్యాఖ్యానము ... | 1 | 4 |
| పంచీకరణము, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 2 |
| ,, తెనుఁగువచనము ... | 0 | 2 |
| బ్రహ్మసూత్రములు, మూలము ... | 0 | 3 |
| ,, తెనుఁగువచనము ... | 12 | 0 |
| భగవద్గీత, మూలముమాత్రము ... | 0 | 6 |
| ,, ఆంధ్రతాత్పర్యసహితము ... | 1 | 4 |
| ,, ,, చిన్నసైజు ... | 0 | 10 |
| ,, అనిబిసెంటుగారి ఇంగ్లీషు తర్జుమాతో ... | 0 | 8 |
| ,, శాంకరభాష్యము, మేలుప్రతి ... | 1 | 8 |
| ,, శ్రీరామచంద్ర సరస్వతీకృత ఆంధ్రటీకాతాత్పర్య సహితము, మతత్రయ భాష్యములనుండి అనేకఅంశములిందుచేర్చి శ్లోకానుక్రమణికతో ముద్రింపఁబడినది ... | 2 | 12 |
| వ్యాసహారపంచకము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 2 |
| వేదాంతస్తోత్రపంచకము ,, ... | 0 | 4 |
| శివగీత, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు ... | 0 | 12 |
| శుకాష్టకము ,, ,, ... | 0 | 2 |
| హరిమీడేస్తవము, సటీక, చక్కనికూర్పు ... | 0 | 4 |
| అమృతబిందూపనిషత్తు, సాంధ్రతాత్పర్యము ... | 0 | 2 |
| అద్వయతారకోపనిషత్తు ,, ... | 0 | 2 |
| అథర్వశిఖోపనిషత్తు ,, ... | 0 | 2 |
| ఆత్మబోధోపనిషత్తు ,, ... | 0 | 2 |
| ఆరుణేయ్యుపనిషత్తు ,, ... | 0 | 3 |
| ఈశావాస్యోపనిషత్తు ,, ... | 0 | 3 |
| ఐతరేయోపనిషత్తు ,, ... | 0 | 8 |

| | | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|---|
| కేనోపనిషత్తు, సాంప్రతాత్పర్యము | | ... | 0 | 4 |
| కైవల్యోపనిషత్తు | ,, | ... | 0 | 2 |
| కృష్ణోపనిషత్తు | ,, | ... | 0 | 2 |
| గర్భోపనిషత్తు | ,, | ... | 0 | 2 |
| జాబాల్యుపనిషత్తు | ,, | ... | 0 | 2 |
| తైత్తిరీయోపనిషత్తు | ,, | ... | 3 | 0 |
| ద్వాదశోపనిషత్తులు, తెనుఁగువచనము | | ... | 3 | 0 |
| అథర్వవేదీయ ప్రాణాగ్నిహోత్రోపనిషత్తు | | ... | 0 | 3 |
| నిరాలంబోపనిషత్తు, సాంప్రతాత్పర్యము | | ... | 0 | 2 |
| పరమహంసోపనిషత్తు | ,, | ... | 0 | 4 |
| బ్రహ్మోపనిషత్తు | ,, | ... | 0 | 2 |
| ముక్తికోపనిషత్తు | ,, | ... | 0 | 8 |
| మండలబ్రాహ్మణోపనిషత్తు | ,, | ... | 0 | 3 |
| యోగతత్త్వోపనిషత్తు | ,, | ... | 0 | 3 |
| వజ్రసూచికోపనిషత్తు | ,, | ... | 0 | 2 |
| వాసుదేవోపనిషత్తు | ,, | ... | 0 | 2 |
| శారీరకోపనిషత్తు | ,, | ... | 0 | 2 |
| స్కందోపనిషత్తు | ,, | ... | 0 | 2 |
| సర్వసారోపనిషత్తు | ,, | ... | 0 | 2 |
| భర్తృహరి సుభాషితము, అట్టబైండు | | ... | 0 | 14 |
| డిటో కాలికోబైండు | | ... | 1 | 2 |
| భాషామంజరి, సటీక, చక్కనికూర్పు | | ... | 0 | 6 |
| భారవి, సవ్యాఖ్యానము, 9 సర్గలు | | ... | 0 | 12 |
| భోజచరిత్ర. టీకాతాత్పర్యసహితము | | ... | 1 | 8 |
| మాఘము, సవ్యాఖ్యానము, 6 సర్గలు | | ... | 1 | 0 |
| ,, 3 సర్గలు, టీకాతాత్పర్యసహితము | | ... | 2 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| మేఘసందేశము, సటీక | 0 | 14 |
| రఘువంశము, 10 సర్గలు, సవ్యాఖ్యానము ... | 1 | 0 |
| ఋతుసంహారము, సాంధ్రటీక ... | 0 | 8 |
| కాదంబరి, మేలుప్రతి ... | 1 | 8 |
| కుమారసంభవము, సవ్యాఖ్యానము ... | 0 | 14 |
| డిటో టీకాతాత్పర్యసహితము ... | 1 | 8 |
| గీతాగోవిందము, (అష్టపది) ... | 1 | 4 |
| దశకుమారచరిత్రము, క్రొత్తకూర్పు ... | 0 | 12 |
| నైషధము, సవ్యాఖ్యానము, 6 సర్గలు ... | 1 | 0 |
| పుష్పబాణవిలాసము, సటీక ... | 0 | 4 |
| పంచబాణవిజయము, చక్కనికూర్పు ... | 0 | 4 |
| కాళిదాసప్రహసనము ... | 0 | 4 |
| సంస్కృత (నాగరిలిపి) బాలశిక్ష ... | 0 | 3 |
| బిల్హణచరిత్ర, సటీక, చక్కనికూర్పు ... | 0 | 8 |
| రఘువంశము, సటీక, మేలుప్రతి ... | 5 | 0 |
| రామాయణచంపు, సవ్యాఖ్యానము ... | 2 | 0 |
| విశ్వగుణాదర్శము, మేలుప్రతి ... | 1 | 0 |
| వసంతతిలకభాణము, చక్కనికూర్పు ... | 0 | 4 |
| విక్రమార్కచరిత్రము, సటీక ... | 1 | 0 |
| హితోపదేశము ... | 0 | 8 |
| అథర్వణకారికావళి ... | 1 | 0 |
| చంద్రాలోకము, సటీక ... | 0 | 8 |
| తిజన్తమంజరి, ధాతుమంజరి ... | 0 | 4 |
| ప్రతాపరుద్రీయము, మేలుప్రతి ... | 1 | 12 |
| లఘుకౌముది, సటిప్పణము ... | 1 | 12 |
| ఆదిత్యహృదయము, సటీక ... | 0 | 3 |

7

| | ప్రతి 1-కి. | రూ. | అ. |
|---|---|---|---|
| శబ్దమంజరి, శుద్ధప్రతి | ... | 0 | 6 |
| ,, ...(నాగరిలిపి) చిన్నసైజు | ... | 0 | 4 |
| ఇంద్రాక్షీశివకవచము | ... | 0 | 2 |
| కృష్ణకర్ణామృతము | ... | 1 | 8 |
| శ్రీకృష్ణలీలాతరంగిణి, సటీక | ... | 1 | 8 |
| గంగాస్తవరాజము ,, | ... | 0 | 2 |
| గంగాలహరి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 2 |
| శ్రీగుణరత్నకోశము, సటీక | ... | 0 | 4 |
| దక్షిణామూర్తిస్తోత్రము, సటీక | ... | 0 | 2 |
| దేవీస్తోత్రకదంబము | ... | 0 | 6 |
| దేవీమానసికపూజ, చిన్నసైజు | ... | 0 | 1 |
| దేవీఖడ్గమాల | ... | 0 | 1 |
| నవగ్రహస్తోత్రము ,, | ... | 0 | 4 |
| నీతిశాస్త్రము, సటీక | ... | 0 | 3 |
| పరమేశ్వరస్తోత్రకదంబము | ... | 0 | 6 |
| ప్రశ్నోత్తరరత్నమాల, సటీక | ... | 0 | 8 |
| ప్రాతఃస్మరణ, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| భజగోవిందము, సటీక | ... | 0 | 2 |
| మృత్యుంజయమానసికపూజ, చిన్నసైజు | ... | 0 | 1 |
| ముకుందమాల, సటీక ,, | ... | 0 | 4 |
| రామబ్రహ్మమానసికపూజ, చిన్నసైజు | ... | 0 | 2 |
| రామకర్ణామృతము, సాంధ్రతాత్పర్యము | ... | 1 | 8 |
| లక్ష్మీనృసింహస్తోత్రము, సటీక | ... | 0 | 2 |
| లక్ష్మీనారాయణహృదయము | ... | 0 | 3 |
| శంకరాచార్యస్తోత్రాది | ... | 0 | 3 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| మొల్ల రామాయణము, చిన్నసైజు పద్దెశరములతో చక్కగా ముద్రితము ... | 0 | 10 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 12 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివరకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది ... | 6 | 0 |
| గిల్టుబైండు 2 వాల్యములు అత్యుత్తమప్రతి ... | 8 | 0 |
| మనుచరిత్ర, సటీక ... | 2 | 0 |
| వసుచరిత్రవిమర్శనము ... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు ... | 3 | 8 |
| ఆముక్తమాల్యద, ,, ... | 3 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు ... | 0 | 14 |
| హంసవిలాసము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 2 |
| రామాభ్యుదయము ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు ... | 1 | 10 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు ... | 1 | 12 |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము ... | 0 | 10 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్రము ... | 1 | 8 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము ... | 0 | 4 |
| ,, కాలికోబైండు ... | 0 | 8 |
| పారిజాతాపహరణము, సాధారణప్రతి ... | 0 | 4 |
| డిటో మేలుకాకితములు, చిన్నసైజు, క్రొత్తకూర్పు ... | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము ... | 0 | 12 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు ... | 1 | 2 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 14 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథప్రణీతము | ... | 2 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 2 |
| పంచతంత్రము, వేంకటనాథకవికృతము | ... | 1 | 4 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగ్గడ, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| బిల్హణీయము, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| వైజయంతీవిలాసము ,, | ... | 0 | 8 |
| రసికజనమనోభిరామము | ... | 0 | 12 |
| ఆంధ్రలలితోపాఖ్యానము | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 0 | 12 |
| కవిచౌడప్పశతకము | ... | 0 | 2 |
| అంబరీషోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | [illegible] |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | [illegible] |
| డిటో కాలికోబైండు | ... | [illegible] | 10 |
| రుక్మిణీకల్యాణము, సటీక | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 10 |
| శ్రీవివేకానందవిజయము | ... | 1 | 12 |
| ప్రాచీనదేశచరిత్రలు | ... | 1 | 12 |
| భారతరమణీమణులు | ... | 0 | 12 |
| డిటో 2-వ భాగము | ... | 0 | 8 |
| పతివ్రతకథలు | ... | 1 | 8 |
| శ్రీమహాభక్తవిజయము | ... | [illegible] | 0 |
| భోజకాళిదాసకథలు 1-వ భాగము | ... | 0 | 12 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | ... | 0 | 4 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.